శ్రీ సీతారామచంద్రపరబ్రహ్మణే నమః.

# శ్రీ దాసులింగమూర్తిచరిత్రము.

శ్రీ సీతారామచంద్ర భగవద్భాండాగారం

పాలపర్తి సూర్యనారాయణ,

(ప్రియదర్శిని, మేవాడపద్మిని, లక్ష్మీనృసింహప్రపత్తి, పుణ్యశ్లోకకృష్ణాస్తోత్రం,
అహోబిలచరిత్రాదిగ్రంథకర్తలు.)

డాక్టరు, గంగరాజు వేంకటరామయ్య.

ప్రథమ ముద్రణము: 1000 ప్రతులు.

ప్రకాశకులు:

డాక్టరు, గంగరాజు వేంకటరామయ్య,

చాగలమర్రి.

బెజవాడ, ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాలయందు

క. కోదండరామయ్యగారిచే

ముద్రింపఁబడియె.

1931

 [వెల రు 0-12-0.

# PREFACE.

The Hindu Religious awakening of the latter part of the Nineteenth Century which rose as a revolt against meaningless ceremonial and superstition on the one hand, and as a challenge against the vigorous attacks of unsympathetic and intolerant critics on the other, found expression in the birth of a new ardour and zeal, not only in the Press and on the Platform, but also in the establishment of religious monastic orders and in the production of a religious literature of a high order of merit And this new ardour and zeal, this awakening of religious life has transfused itself into the lives of many men, reforming them and making them true servants of God, His real children. Thus is the Hindu coming back to his own heritage, and the materialistic and cynical attitude of life which men had in the early part of this century—in the hey-day of the Age of reason—is fast giving place to a devotional and reverential attitude towards God Thus has the old order changed, yielding place to the new.

Tee present volume which this preface humbly seeks to introduce to the public is of the kind of religious literature which places before the ordinary work a dav man of the world, ideals which are within his easy reach, and principles which had to plain living and high thinking. As in other religions, so in Hinduism 'in its misunderstood and mutilated form, there is a diversity of opinion about principles and practices, which has created diverse doctrines and dogmas, each proclaiming and upholding its own supiriority and worth in works specially preduced to further its own cause. But the Hindu—the real vedantist—does not quarrel about creeds and credentials, as his religion consists, not in believing, but in being and in becoming, and in the realisation of Godhead. His is no religion of fear and fight, of threat and intimidation His is the Gospel of hope and courage, of Ahimsa and stern self-endeavour But it is some times asked, "Is man a tiny boat in a tempest, raised one moment on the foamy crest of a billow, and dashed down the next moment into the yawning chasm below, rolling to and fro at the mercy of good and bad actions,—a powerless, helpless eck, w rin an ever-raging, ever-rushing, uncompromising, current of cause, and effect,—a little moth placed under the wheel of causation which rolls on crushing everything in its way, and waits not for the widow's tears or the orphan's cry?" Our answer is an emphatic "No" for those that have ears to hear, ours is the message

of hope and inspiration which in clarion notes of divine harmony claims us all as "children of immortal bliss and heirs of ever-lasting life," and says "ye are the sharers of immortal bliss holy and perfect beings, ye are divinities on earth,—sinners? It is a sin to call a man so, it is a standing libel on human nature" There is comfort and hope in that message of peace and good-will All the contradictions about it are seeming, apperant ones,—the result of smaller minds trying to grasp the eternal truth and adapting it to different circumstances and natures—a dome of many-coloured glass staining the white radiance of eternity Though the basic principles of Sanatana Dharma are plain and simple, various people have interpreted them variously In this volume however a coherent amalysis is given for the building up of a religious life and character–a life and character which is "pious, dutiful, strong, self-reliant, upright, righteous, gentle and well-balanced" the life and character of a good man and citizen.

According to the Hindu, Mukti or Salvation in attainable through the three-fold path of Knowledge (Jnana), Action (Karma) and Devotion (Bhakti). In the interpretation and the unfolding of the truth about this path, some sages, gave prominence to knowledge, some to action and some to devotion But the truth about it all is that the real path of Salvation is the synthesis of these three, the liking of a pure life of virtuous actions, the living of a holy life of love and adoration of God, the living of a life of wisdom and knowledge of Godhead Philosophical dogma and priestly superstition created a chads of doctrines and formalities-the real life of action gave place to the dead bones of sacrifices and ceremonial worship, Knowledge was elbowed out of the way by rigid asceticism, and Devotion was lost in formal singing, dancing and morbid imagining. To call men back to their immortal heritage, prophets were born from time to time, some were the really inspired ones, the revealers of eternal truths, some were merely sages who had achieved knowledge by study and meditation, and some were saints, men of Godliness who had tasted of the Bliss Eternal by self-culture Lesser than these, for their province is restricted, but moving towards the same end are the mystics who proclaim truths suddenly revealed to them like lightning, the men of faith and grace, the spiritual-healers, and the Miracle-men When the fury and the struggle of the fierce strife about the religious faiths and dogmas settle down, and the disturbed and troubled and turbulent waters of the confusing currents of religious orders subdue themselves into the evolution of the clear limpid flow of liking faith

the quota which like the squirrel of the Ramayana, each prophet and priest, each sage and saint contributed to the construction of the edifice of God-realisation, will be discernable in all its marked peculiarities and colours. And to arrive at the proper estimate of a man or saint, it requires observation of the effect of his life on his followers and others, long after he has outgrown this earthly garment. In this book the authors have steered themselves clear of many shoals and sands, many rocks of doubt and dissent, and have given us the substance of a faith which lights in its own way the path of the seeker of truth.

The authors, Mr G Venkataramayya and Mr. P. Suryanarayana have done us great service by unfolding to us great religious truths in an easy and fluent style and in introducing to us the spiritual Guru of Mr. Venkata Ramayya, Mr P. Lingaraju. I am glad that both of them Messrs Venkatramayya and Lingaraju are giving a great impetus to religious faith and activity They have won our gratitude for the new life they have given to some temples and the new vigour they have added to Bhajana And I am glad that I have the privilege of this oppourtunity to commend to the public through the medium of this dilatative and digressive preface, the relgious acts and spiritual service of Mr Venkataramayya and Mr. Lingaraju And I applaud the efforts of Mr. Suryanarayana in co-operating with them

"Awake, Arise, and Stop not till the goal is reached."

ALLAGADDA,<br>25-12-30.

S LAKSHMINARASAYYA, M.A , L.T.,<br>*Deputy Inspector of Schools.*



# విన్నపము.



"మ జ్జన్మనః ఫల మిదం మధుకైటభారే
మ త్ప్రార్థనీయ మదనుగ్రహ ఏష ఏవ
త్వద్భృత్యభృత్యపరిచారకభృత్యభృత్య
భృత్యస్య భృత్య ఇతి మాం స్మర లోకనాథ!"

—ముకుందమాల.

అని మలయాళదేశాధీశుం డగు కులశేఖరాళ్వారులవారు వర్ణించియున్నారు. పరమేశ్వరునియెడ భక్తికలిగియుండుట పవిత్రము. అట్టిపవిత్రమగు భక్తిగల మహాత్ములయెడ నమ్రుఁడై భక్తి నలుపుట పవిత్రతరము.

అట్లగుటవల్లనే నిష్కామ్యముగా ననేక యన్నసత్రస్థాపనలు, దేవాలయప్రతిష్ఠలు, దేవాలయోద్ధరణములు, సప్తాహములు, కోటిప్రతిపూజలు నీశ్వరప్రీతిగా సలిపి, దేశమునందు భక్తిని రగుల్కొలిపిన శ్రీ పోణంగి లింగమూర్తిదాసుగారి పాదరజోలేశమందు మాకుఁ గలభక్తియే మమ్ముల నీచరిత్ర వ్రాయఁ బ్రోత్సహించినది. చరిత్రకారుల కుండవలసిన నిష్పాక్షికబుద్ధితో మాకుఁ దెలిసిన, మేము వినిన, మేము చూచిన విషయముల నిందు పాఠకమహాశయుల కర్పించితిమి.

భౌతికముగ భారతీయులు హీనస్థితియందున్నను, అధ్యాత్మికమునం దత్యుచ్ఛదశయందుండుట లోకవిదితము. పాశ్చాత్యనాగరకతావ్యామోహమున మతమునందలి భక్తి సడలిన నిక్కాలమున నీమహనీయుఁడు దైవమతభక్తిఁ బ్రజలయందుఁ బ్రజ్వరింపఁజేయ నిట్టిసత్కార్యాచరణమునకు సమకట్టిరి. ఇట్టి మహాత్ముఁడు సర్వజనారాధ్యుఁడు, పూజ్యుఁడు, మార్గదర్శకుఁడు, ఆదర్శపాత్రుఁడు. పండితులు కవులు

మతసంస్థాపకులు దమతరము గడచినపిమ్మట గుర్తింపఁబడుట సహజము.

శ్రీదాసుగా రట్లుగాక సమకాలికులవల్లనే పొగడఁబడుట వీరి యనూనార్హతయే కారణము. వీరి జీవితమర్మములను ధర్మమును ప్రజలెల్లరు గుర్తించి తమ నిత్యాచరణయం దుంచుకొనిన, సనాతనమగు హిందూమతము తన తొల్లిఁటి ప్రతిభ గణించును. మతధర్మ ముద్ధరింపఁబడి మతసూక్ష్మములు గ్రహింపఁబడిన దేశము నందుఁగల యంతఃకలహములు తుదముట్టును.

ఇట్టి మహనీయుని చరిత్రమును గించిజ్ఞులమగు మేము వ్రాయఁ బూనుట సాహసమ యగు. పెక్కులోపము లుండియుండును. విజ్ఞులు క్షమింతురుగాక. ఎవరేని వీరిజీవితమందలి నూతనాంశములుగాని మా రచనయందలి లోపములుగాని దయతోఁ దెలిపిన ద్వితీయ ముద్రణమున సవరించుకొందు మని మనవిచేయుచున్నాము.

ఈ గ్రంథమువలని యాదాయమును శ్రీ చాగలమఱ్ఱి చెన్న కేశవస్వామివారి శాశ్వతపూజానిధికిఁ జేర్చునట్లు నిశ్చయింపఁబడినది. ఎల్లరు ప్రోత్సహింతు రని ప్రార్థించుచున్నాము.

చాగలమఱ్ఱి,
10—12—30.

ఇట్లు
భక్తజనవిధేయులు,
గ్రంథకర్తలు.





శ్రీ దాసు లింగమూర్తిగారు.




శ్రీమ దహోబిలక్షేత్ర స్థాపనకుఁ, బ్రస్తుత పోషణకు,

భవిష్య దుద్ధరణమునకుఁ గారకులగు

భక్తబృందమున కీ చరిత్రమును భక్తితో

సంకిత మొనర్చుచున్నాము.

గ్రంథకర్తలు.



హరిః ఓం.

శ్రీ గురుభ్యో నమః.

శ్రీ సీతారామచంద్రపరబ్రహ్మణే నమః.

# శ్రీ దాసు లింగమూర్తి జీవితము.

శ్లో॥ శ్రీరామం, త్రిజగద్గురుం, సురవరం, సీతామనోనాయకం,
శ్యామాంగం. శశికోటిపూర్ణవదనం, చంచత్కలాకౌస్తుభం
సౌమ్యం, సత్వగుణోత్తమం, సుసరయూతీరేవసంతం ప్రభుం
త్రాతారం సకలార్థసిద్ధిసహితం, వందే రఘూణాం పతిం.

శ్లో॥ రామేతి వర్ణద్వయమాదరేణ
సదాస్మరన్ముక్తి ముపైతిజంతుః
కలౌయుగే కల్మషమానుషాణా
మన్యత్రధర్మే ఖలు నాధికారః.

భక్తప్రియం భక్తసమాధిగమ్యం
చింతాహరం, చింతితకామధేనుః.
సూర్యేందుకోటి ద్యుతిభాస్వరంతం
రామం భజే రాఘవరామచంద్రం.

శ్లో॥ సకలభువనరత్నం సర్వశాస్త్రార్థరత్నం
సమరవిజయరత్నం సచ్చిదానందరత్నం
దశముఖహరరత్నం దానవారాతిరత్నం
రఘుకులనృపరత్నం పాతు మాం రామరత్నం.

— రామకర్ణామృతము.

---

## ౧. ప్రవేశము

శ్రీ సచ్చిదానందస్వరూపుం డగు పరబ్రహ్మ తన దివ్యలీల కొఱకు సమస్తచరాచర ప్రపంచంబు సృష్టించి తా నందుఁ బ్రవేశించి కాలస్వరూపియై యానందించుచుండు.

అట్టి పరబ్రహ్మ స్వరూపంబైన కాలము పరుగిడిపోవుచున్నది. దానితో జీవుల యాయురారోగ్యైశ్వర్యంబులును ఛాయఁబోలె నదృశ్యంబు లగుచున్నవి.

కాని మాయామోహితులై, యశ్వరము లగు నైహికసుఖలంపటులై జీవులు కాలపురుషుని గతి గమనింపలేకున్నారు.

మాయ నతిక్రమించిన యోగియొక్కరునికిఁ దక్క కాలవేగము గుర్తింప నితరుల కసాధ్యంబు. ఆమాయ నూతఁగొనియే కాలనాథుఁడగు చిత్స్వరూపి భగవంతుఁడు ప్రపంచనాటక సూత్రధారియై ప్రకృతిరంగమున నజ్ఞులచే నాటక మాడించుచున్నాఁడు.

మాయా విమోహితులగు జీవులకు సారహీనంబును, జనన మరణ రూపకంబును, పాపభూయిష్టంబును నగు నీ సంసారమే కడు మనోహరంబై సేవ్యంబై యొప్పుచుండును.

ఇట్టి యనతిక్రమణీయమగు విష్ణుమాయను దాఁటుటకు యుగ యుగంబుల భిన్నభిన్న మార్గము లవలంబనీయములుగా నున్నవి.

కృతయుగంబున మనుష్యులు శాంతులు, నిర్వైరులు, సమదర్శనులు నై శమ దమ తపములచే హరిమాయ దాఁటఁగలిగిరి.

త్రేతాయుగంబున మానవులు ధర్మిష్ఠులై, బహ్మవాదులై, త్రయీవిద్యచే సర్వదేవమయుండగు హరి నారాధించి వైష్ణవమాయం దరించిరి.

ద్వాపరంబున మర్త్యులు జిజ్ఞాసువులై వైదికాగమమార్గంబుల విశ్వాత్మ మెప్పించి యాతని మాయను జయించిరి.

కలియుగంబున హరినామస్మరణరూపకం బగు యజ్ఞము నొనర్చి యవిద్యాబాధితులు గాక యుండఁగలరు. కలియందు మానవులు అల్పజ్ఞులు నల్పాయుష్కులు నగుటచే, సులభంబగు భక్తిసాధనమున, బ్రకృతిమాయను నిర్జింప సమకట్టిరి. బ్రహ్మమానసిక పుత్రుఁడును, దేవమునియు, భక్తలోకశిఖామణియు నగు నారదమహర్షి భక్తి నీవిధమున నిర్వచించెను. "సా త్వస్మిన్ పరమప్రేమ రూపా" అనగా

పరమేశ్వరునియందుఁ గాఢమగు ప్రేమ నిలుపుటయే భక్తి. ఇట్టి భక్తి పరమేశ్వరునియందుఁ దప్ప వేఱొకవిషయమునైఁ బోదు. జ్ఞానము కర్మము దీని కతీతములు కావు. దీని కిదియే గమ్యము. మనోవాక్కాయ కర్మల నొకేరీతిఁ గన్నట్టు.

జడత్వము సోమరితనములకుఁ జోటీయకుండు. దీనిం బడసిన జనన మరణ రూపకం బగు సంసారమును దుదముట్టింపనగును.

నారదమహామునిశిష్యుఁడును, ప్రథమ సత్యాగ్రహావేశుఁడును, నద్వితీయ భక్తుఁడును నగుఁ బ్రహ్లాదుఁడు.

"తనువాృద్భాషలసఖ్యముఁ శ్రవణముఁ దాసత్వముఁ వందనార్చనముఁ సేవయు నాత్మలో నెఱుకయుఁ సంకీర్తనల్ చింతనం బను నీ తొమ్మిది భక్తిమార్గముల సర్వాత్ముఁ హరిఁ నమ్మి సజ్జనుఁడై యుండుట భద్ర" మని తొమ్మిది భక్తిమార్గముల బోధించి యున్నాఁడు.

ఒండొక మహనీయుఁడు, భక్తి, ప్రకృతిసహజము లగు త్రిగుణంబులకు లోనై, సాత్త్వక రాజసిక తామసికము లని ముత్తెఱంగుల గుర్తింపఁబడు నని యానతిచ్చె.

సాత్త్వికభక్తుఁ డాచార వ్యవహారములకు లోనుగాక, బాహ్యపూజలయందు నిమగ్నుఁడుగాక యేకాంతమున నీశ్వరు నారాధించుచుండును. రాజసిక భక్తుఁడు బాహ్యాడంబరములు గలిగి యర్చనాది కర్మలఁ గావింపుచు, బాహ్యనిష్ఠలకు లోనై యుండును. తామసిక భక్తుఁడు బందిపోటుదొంగరీతి మోటుమానిసి. పరమాత్ముఁగూర్చి వేదమంత్రములుగాని, సున్నిత ప్రార్థనలుగాని సలుపక ప్రత్యక్షపశువులకుఁ బట్టుబట్టి తుద కట్టి ఫలముకొఱకుఁ బ్రాణమునైన నర్పింపఁ దెంపుఁ జెందియుండును. క్షుద్రదేవతల నర్చించువారును, బలు లొసంగువారును నీ తెగలోనే చేరుదురు.

పైన నిరూపింపఁబడిన తెఱఁగున గలియందు భక్తియే తరణోపాయ మనుట స్పష్టము. ఆ భక్తియును "పానీయంబులు ద్రావు

చుఁ గుడుచుచుఁ భాషించుచుఁ హాస లీలా నిద్రాదులు చేయుచుఁ దిరుగుచుఁ లక్షించుచుఁ సంతత శ్రీనారాయణ పాదపద్మ యుగళీ చింతామృతాస్వాదసంధానుండై మఱచుఁ సురారిసుతుఁడే తద్విశ్వ ముఁ." ప్రహ్లాద భక్తునియందుఁ బోలె నిట్లుండవలయును.

భవాంబుధిఁ దరింపఁజేయు జ్ఞాన, కర్మ, భక్తి యోగంబుల మూఁడింటిలోనను భక్తియే సులభమార్గము.

"యేతు సర్వాణి కర్మాణి మయిసన్న్యస్య మత్పరాః
అనన్యే నైవ యోగేన మాం ధ్యాయంత ఉపాసతే."
"తేషా మహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్
భవామి నచిరా త్పార్థ! మయ్యావేశితచేతసామ్."
—(భగవద్గీత.)

"అర్జునా! ఎవరు నాయందుఁ బరాయణులై నన్నే మిక్కిలి యుత్తమగతిఁగాఁ దలంచి సర్వకర్మల నాకర్పించి యనన్యభావముతో ధ్యానింతురో, యట్టి నాయందుఁ జిత్తము నిల్పినవారిని మృత్యురూప మగు సంసారసాగరమునుండి తరింపఁ జేయుచున్నాఁడను. కాన నీ మనసును నాయందు నిలుపుము. నీబుద్ధిని నాయందు సంలగ్నమొన రింపుము. ఇట్లొనర్తువేని నీ దేహాంతమున నన్నుఁబొందెదవు.

"నీచిత్త మట్లు నాయందు సుస్థిరముచేయఁ జాలవేని నన్నుఁ బొందవలయుననుకోరికతో నభ్యాసమొనరింపుము. ఇదియు నీ కసాధ్య మగుచో నీ వొనర్చు సకలకర్మలు నాకర్పించుము. నానిమిత్తము, నా ప్రీతి కొఱకు, కర్మలాచరింపుము. దీనినిఁ జేయఁజాలకున్న నీ వొనర్చు సర్వకర్మ ఫలముచు నాకుఁగాఁ ద్యజించుము." అని శ్రీకృష్ణుఁడు తన మఱఁది యగు నర్జునున కుపదేశించెను.

కనుక మానవులకు సులభంబును, సర్వభూత హితంబును, భగవత్ప్రీతికరంబును నగు భక్తి ననుష్ఠించుటయే యుత్తమపద్ధతి. ఈ భక్తియోగమునందుఁ దక్కిన మూఁడు యోగములును లీనమై యున్నవి. దానంజేసి యోగములన్నియు నాచరించినఁ బ్రాప్తించు మోక్షము భక్తునకు సిద్ధించును.

ఇట్టి పవిత్రభక్తి లభించినపురుషుఁడు జీవన్ముక్తుఁడు, పూర్ణయోగి, పరిపూర్ణుఁడు, తృప్తుఁడు, ఆనందోన్మత్తుఁడు, విషయానందవిముఖుఁడు, పరమశాంతుఁడు, కామక్రోధ లోభమోహ మదమాత్సర్యాది దుర్గుణవిముక్తుఁడు, సర్వభూతహితుఁడు, పరమదయాళుఁడు, ద్వంద్వాతీతుఁడు, నిస్పృహుఁడు, పవిత్రుఁడు, సంకల్పశూన్యుఁడు, యదృచ్ఛాలాభసంతోషి యై తనసర్వస్వము పరమేశ్వరున కర్పించు.

భక్తిమార్గ మవలంబించి భవాబ్ధిదాటిన మహాపురుషు లెందఱో గలరు. వీరు పరోపకారపరాయణు లగుటచే సంసారవ్యామోహంబున మునింగిన తోడిమానవుల కెందఱకో యుత్కృష్టమార్గమగు భక్తి నుపదేశించి లోకోపకార మొనర్చుచుందురు.

"యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహం
పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే॥"

—(భగవద్గీత.)

ఎప్పుడు ధర్మము క్షీణించి యధర్మము వృద్ధిఁజెందునో యప్పుడు శిష్టానుగ్రహ దుష్టనిగ్రహ ధర్మసంస్థాపన లొనర్చుటకుఁ బ్రతియుగమునఁ దా నవతరించు చున్నాఁడ నని భగవంతుఁ డానతిచ్చెను.

ఇట్టి యవతారముల యవసరము తఱచు యుగయుగసంధుల యందుఁదక్క యితరసమయములయం దుండనేరదు. కాని మధ్యకాలంబునఁ గలుగు ధర్మలోపంబుల జగదీశ్వరుఁడు తన యాంతరంగికభక్తులచేఁ దీర్పించుచుండును. ఈ తరగతిలోనికివచ్చు మహాపురుషులలో శ్రీయుత పోణంగి లింగమూర్తిగారొకరు. ఈ భక్తాగ్రేసరుఁడే మన కథానాయకుఁడు.



## ౨ జననము

త్యాగశీలురగు మన పూర్వులు లోకోపకారమునకై పెక్కుకోట్ల ధనము వ్యయపఱచి పట్టణమనక పల్లెయనక, యూరూర దేవాలయ ప్రతిష్ఠలఁ గావించియుండిరి. వివేకులగు మన పూర్వు లెందుకిట్లీ బీద దేశపు ధనముఁ గోట్లకొలఁది వెచ్చించి దేవాలయముల స్థాపించిరో యించుక విచారించుట మన ధర్మము.

ప్రతి యాలయమున నే దేని నొక దైవవిగ్రహము ప్రతిష్ఠింపఁబడి పూజ లందుచుండును. ఈ విగ్రహము మిక్కిలి సుందరముగాఁ జేయఁబడి విలువగల యాభరణాద్యలంకారములతో నేత్రానందముగా నుండును. ఈ దైవవిగ్రహము నర్చించు విధానమును భక్తులు గాంచి యట్టిరూపమునే తమ హృత్పద్మమునందుఁ బ్రతిష్ఠించి విరామము దొరకినప్పుడెల్ల దేవాలయమునఁ దాము చూచినరీతిగ నర్చనావిధానమునఁ బూజించుట, నైవేద్య మొసఁగుట, ధూప దీప నీరాజనంబు లొసంగుట, నెమ్మనమ్మున సలిపి తరించవలయుననియే దేవాలయ నిర్మాతల యాశయమని నే నూహింతు.

కొంతకాల మట్లు సలిపిన మనంబు సుస్థిరమగును. శాంతిఁ జెంది యానందమున నోలలాడును. అన్ని దానములలో విద్యాదానము కడు శ్రేష్ఠమనియు, నందుఁ బరవిద్య శ్రేష్ఠతమమనియు, మన పూర్వులు గుర్తించి పరమేశ్వరునిమీఁది భక్తిఁ బ్రజలకు గలిగించుటయు నిట్టి పరవిద్యాదానముగ భావించి, కోట్లకొలఁది రూప్యాంబుల యాచించియు, గొన్నియదనుల మ్రుచ్చిలియుఁగూడ దేవాలయనిర్మాణములకొఱకు వెచ్చించి, ప్రజాసేవ నొనర్చి, తన్మూలమున నీశ్వరకటాక్షమును బడసిరి. పూర్వు లిట్టి కార్యముల విరళముగ సాగుచుండుటకై దేవాలయనిర్మాణమును సప్తసంతానములలో నొకటిగాఁ జేర్చియున్నారు.

అట్లు మనపెద్దలు స్థాపించిన దేవాలయములలో మిన్నయై హిందూదేశమునం దంతట నేకచ్ఛత్రాధిపతియై ధనార్జన సముత్సు

కుఁడై యున్నవాఁడు తిరుపతి వేంకటేశ్వరుఁడు. "కలౌ వేంకటనాయకః" యనుట ప్రఖ్యాతము. ప్రతి హైందవహృదయమునను, ముఖ్యముగాఁ బ్రతి యాంధ్రునింటను, వేంకటేశ్వరుఁడు ప్రత్యక్షము. తక్కిన దైవములవలెఁ గాక వీని "కాపద మొ్రక్కులవాఁ"డని సార్థకనామము కలదు.

ఇట్టి కష్టనివర్తియగు కలియుగ చక్రవర్తి యారుకొండలు దాఁటి యావనులు బలాఢ్యులుఁ దక్క నితరు లధిరోహింప సాధ్యముకాని యేడవకొండ శిఖరముపైన వెలయుటచే నెల్లరకు దర్శన భాగ్య లోపముఁ దొలఁగింప నెంచి యీదేవుని పేర నచ్చటచ్చట చిన్న తిరుపతులను నిర్మించిరి.

ఇట్టి ప్రతిబింబ (అనుకరణ) తిరుపతిక్షేత్రములలో విశాఖ పట్టణమండలమందున్న యుప్పుమాక వేంకటేశ్వరాలయ మొకటి. ఆప్రాంతముల భక్తులు వేలకొలఁది యాక్షేత్రమునకు స్వామిదర్శనమునకు వచ్చుచుందురు.

ఆ క్షేత్రము గొడే జమీందారుల జమీలోనిది. జమీందారగు శ్రీగణపతి రాయణింగారి యాస్థానమునఁ బోణంగి వేంకటరామయ్యగారను భక్తుఁడు స్వల్పవేతనముపై సముద్దారు పనిచేయుచుండెను. వీరి స్వగ్రామము చంద్రవరము. ఆరువేల నియోగిబ్రాహ్మణుఁడు. కృష్ణవేణమ్మగారు వీరిధర్మపత్ని. ఈపుణ్యదంపతు లిరువురకు నేవురు బిడ్డలు కలిగిరి. తల్లికిఁ గడఁగొట్టుబిడ్డఁడుగ మనకథానాయకుఁడగు శ్రీలింగమూర్తిదాసుగారు, 1895 సంవత్సరము నవంబరు 4వ తేదికి సరియగు స్వస్తిశ్రీ జయనామ సంవత్సర ఆశ్వయుజ బ ౧౦ సౌమ్య వాసరమున శుభ ముహూర్తమున జన్మించిరి. గుడిమెట్టగ్రామవాసులును, సిద్ధాంతులునునగు, శ్రీ శివరామ బాలసరస్వతికవిగారిచే రచింపఁబడిన వీరి లఘుజాతక మీ క్రింద వివరింపఁబడినది.

"స్వస్తిశ్రీ విజయాభ్యుదయజయనామసంవత్సరే దక్షిణాయనే శరదృతౌ ఆశ్వయుజమాసే కృష్ణపక్షే సౌమ్యవాసరప్రయుక్తదశమ్యాం రాత్రౌ పూర్వాఫల్గునీ నక్షత్రప్రథమచరణే వృషభలగ్నే సూ

ర్యహోరాయాంబుధద్రేక్కాణే బుధనవాంశే ఉత్తమాంశవర్గోత్తమాంశవేళాయాం శ్రీరమారమణచరణసరోజమకరందరసాస్వాదనేందిందిరాయమానచేతస శ్రీమతో లింగమూర్తినామధేయస్య పురుషశిరోమణే ర్జన్మపుత్రికా.

(తత్కాలగ్రహసంపత్తిః)

చిత్తా ౪ రవిః పుబ్బా ౧ చంద్రః అశ్వనీ ౧ కుజః (వక్రీ) విశాఖా ౨ బుధః ఆర్ద్రా ౩ గురుః చిత్తా ౩ శుక్రః స్వాతి ౧ శనిః ఉ. భా. ౨ రాహుః ఉత్తరఫల్గుణి ౪ కేతుః.

| | | | |
|---|---|---|---|
| రా | కు | ల | గు |
| | లగ్నకుండలి | | |
| | | | చం |
| | | ర శ బు శు | కే |

| | | | |
|---|---|---|---|
| కే | కు | బు | |
| గు | అంశకుండలి | | |
| | | | చం |
| శ | ర | శు | రా |

జయసంవత్సర ఆశ్వయుజ బ ౧౦ మొదలుకొని విరోధికృతు మార్గశిర బ ౨ ల వఱకు జరుగబడిన తత్ఫలము.

సూర్యమహర్దశా ఫలం.

ఇంచుక నీలవర్ణాతిశయదేహుండును, అబాహుళ్యమూర్తియు, రెండు సంవత్సరముల యీడు వచ్చులోగానే మాతృమరకమును రాజవిద్యయందు సామాన్యుఁడును, విద్యకొఱకు కతిశ్రమ పడినవాఁడును, జీవితకాలమంతయు నప్రతిహతమైన యాజ్ఞ కలవాఁడగును. సదా యుద్యోగ లక్ష్మియు సత్కార్యానుష్ఠానము గలవాఁడుగ నుండును.

చంద్రమహర్దశా ఫలము.

18 మొదలు 34 సంవత్సరముల వఱకు చంద్రమహర్దశ. మిక్కిలి సత్కర్మలాభమును, పుత్ర పుత్రికా సంతాన లాభమును,

సద్బుద్ధి వృద్ధియును పితృనష్టమును, భగినీనష్టమును, గలుగును. యజ్ఞయాగాది క్రితు తుల్యమగు ధర్మకార్యములు చేయును.

అంగారక మహర్దశాఫలము.

35 సంవత్సరములు మొదలు 52 వఱకు నంగారకమహర్దశ. ఇందు కళత్రిమారకమును బుత్రివృద్ధియు చంద్రిమహర్దశలో నెట్టి శుభకార్యములు చేయఁబడెనో యట్టి శుభకర్మాచరణమును, ప్రిజోత్పత్తి, ఆంగీరస సంవత్సరములలో మారకతుల్యమగు గండముగాని ద్వితీయకళత్రి లాభముగాని కలుగుటయు, బహుశః ద్వితీయకళత్రి లాభమునే పొందుటయు, 52 వ సంవత్సరము వచ్చువరకు యత్నకార్యసిద్ధియు, శతృిజయము, అప్రితిహతముగా నాజ్ఞసాగుటయు, ఉద్యోగలాభము, రాజ్యధనలాభము, మనోల్లాసము, భూలాభము గృహలాభము, ఈమహర్దశాంతరమంతయు వివాహాది శుభకార్యములు ధర్మకార్యముల మూలముగా ధనవ్యయము జరుగును.

బుధమహర్దశాఫలము.

52 మొదలు 69 సంవత్సరములవరకు బుధమహర్దశ.—ధనము వచ్చుచున్నను కావలసివచ్చినప్పుడు లేమియు, గృహభూజలస్థానము లించుక శిధిలములై పునరుద్ధరణము లగుటయును, సదా సత్కార్యాచరణమును, అప్రితిహతముగా నాజ్ఞ సాగుటయును, యత్నకార్యసిద్ధియు 53-58 లేక 67 సంవత్సరములలో నొకదానియందు గండమును, (అనగా ప్రిణరూపకముగనో లేక యితరవిధముగనో కలిగి నివర్తించుటయును,) అట్లు గండము గడచెనేని 69-70 సంవత్సరములో తప్పక మారకమును జరుగును.

అథ జాతకాలంకారః.

ఈ జాతకునకు జన్మాధిపతియైన రవియున్న తులాస్థానము జీవస్థానమైన సూత్ముదేహమునందు శని తన మిత్రులైన బుధగురు శుక్రులఁగూడి గురునిచే జూడఁబడుచున్నందున పృధ్వీపతి కావలసినందుకు పాపగ్రహములైన సూర్యాంగారకుల యుక్తావలోకితుఁడై

నందువలన పృథ్వీశయోగము చెడి, బుద్ధిశాలియైన పృథ్వీపతి యే సత్కీర్తిప్రతిష్ఠ లార్జించునో యట్టి యజ్ఞయాగాది క్రతుతుల్యములగు ధర్మకార్యములచే ఆర్జింపఁబడిన ప్రతిష్ఠగలవాఁడుగను విద్యావినయ సంపన్నుఁడును రాజతుల్యుఁడును, పుత్రపౌత్రాది కుటుంబవృద్ధిగల వాఁడును, దేవబ్రాహ్మణభక్తి యుక్తుండును, దీర్ఘాయుష్మంతుండును నయి శోభిల్లును.

సమస్త మంగళాని భవంతు.

---

## 3. బాల్యము - విద్యాభ్యాసము

దైవగతి దురూహ్యము. పూర్వజన్మ కర్మానుసరణము న నీజన్మంబునఁ గష్టసుఖంబులు, కలిమి లేములు మానవుని ప్రయత్నము లేకయే ప్రాప్తించుచుండును. లోకమున నెల్లరు సుఖము, ఆనందము, కలిమి, పేరు ప్రతిష్ఠలు వాంఛింతురుగాని కష్టము, దుఃఖము, లేమి, యనామకత్వము, గోరు నజ్ఞు లుండరు. అహంభావపూర్ణులు నల్ప జ్ఞులుఁదక్క వివేకజ్ఞులు సంసారమున సహజముగ సంభవమగు ద్వంద్వములచేఁ దమ మనశ్శాంతినిఁ గోల్పోవరు.

యోగ్యులును నిరాడంబరజీవులును యథా లాభతృప్తులును నగు పోణంగి వేంకటరామయ్యగారు కష్టకష్టములలో దుర్భర మగు భార్యా వియోగమును మన కథానాయకుఁడు జన్మించిన నాలుగు మాసములైన నరుగక మున్నే విధివశమున ననుభవించ నయ్యెను.

కళత్ర వియోగమునకు దైవమును దూరక యినుమడించిన భక్తితో పరమేశ్వరుదయ నాశించి వేంకటరామయ్యగారు కాలముఁ గడుపుచుండిరి. వీరికిఁ గల బిడ్డలేవ్వరు పసివారు. కడగొట్టు లింగ మూర్తిగారు నాల్గుమాసముల కూన. ఈపసిపాపను లాలింపఁ బోషింపఁ దల్లి కఱవయ్యెను. ఇట్లసహాయస్థితియందున్న యర్భకుని తండ్రియే కడుగోమునఁ బెంచెను. జనకుఁ డెంత శ్రద్ధవహించినను

నుద్యోగముం డుండుటచే రాత్రింబగళ్ళు బిడ్డలను గనిపెట్టి పెంప నసాధ్యమయ్యె. కనుకనే మనదాసుగారు తల్లి కొఱవడినబిడ్డరీతి నొక విధముగుఁ బెంకెతనము నేర్చెను. ఈచిన్ననాటి పెంకెతనమే మును ముందు కార్యదీక్షగాఁ బరిణమించుట మనము గాంచఁగలము.

ఆగ్రామమునఁ గల ప్రాథమిక పాఠశాలయందు దాసుగారు విద్యారంభముఁ గావించిరి. బిడ్డను బోషించు నాఁడు దక్షత యింటను, హూణభాషఁ గఱపు పాఠశాల యూరను, లేకుంటచే వీరి సమీప బంధువులును, గాకినాడ వాస్తవ్యులును నగు కానుకొల్లు వేంకటప్పారావుగారి బాలు నింగ్లీషుఁ జదివింపఁ బంపఁగోర వేంకటరామయ్యగారు సంతసించి పదివత్సరముల వయస్సునున్న లింగమూర్తిని గాకినాడకుఁ బంపిరి.

కాకినాడ యాంధ్రదేశమునకెల్లఁ బెద్దపట్టణము. వీధులు విశాలములు. సముద్రతీరమున నుండుటచే సౌమ్యవాతావరణ స్థితి గలిగియుండును. ఉదారులగు శ్రీ పీఠికాపురాధీశ్వరు లీ పట్టణమున నొక కళాశాల స్థాపించిరి. దానియందు దాసుగారు తమ మాధ్యమిక విద్యాభ్యాసముఁ గావించఁదొడఁగిరి. వీ రప్పు డణుమాత్రమేని శాంతము లేక శీఘ్రముగాఁ గోపించుస్వభావము గలిగి పెంకెగా నుండిరి. తాము వినిన, చూచిన, చేసిన ప్రతివిషయము నందును గడుశ్రద్ధఁగలిగియుండిరి. తమతరగతియందుఁ దోడిబాలురకు మిన్నయై చుఱుకుఁదనము గలిగియుండిరి.

వీరు రెండవ ఫారము చదువునపు డొక యోధ్రజ్యోతిష్కుఁ డప్పారావుగారి యింటికి వచ్చుట తటస్థించెను. మధ్యాహ్నభోజనము గావించి కళాశాలకు వెళ్లుచున్న దాసుగారినిఁ గాంచినంతనే దైవజ్ఞుఁడు పరమాశ్చర్యమంది ముందీబాలుఁడు మహాయోగపురుషుఁడగు నని నుడివెను. అప్పారావుగారు వారిని వివర మడుగ శ్రీ దాసుగారి కాలిబొట్టనవ్రేళ్ల యందును, కరాంగుష్ఠంబులయందును జక్రము లుండి తీరవలయుననియు, నట్టిచక్రములుగల పురుషుఁడు రాజుగానైన మఠాధిపతిగానైన నగును; లేనిచో గొప్పయోగముగల మహాపురు

ష్ఠుఁడై లోకసేవ నొనర్చువాఁడైన నగు నని నుడివి, బడికిఁ బోవుచున్న వీరినిఁ బిలిపించి నాలుగువేళ్లయందుఁగల చక్రముల నప్పారావుగారి కిం జూపించెను. ఏమ్మట జరిగిన యుదంతమువలనఁ బండితుని మూఁడవ యభిప్రాయము యథార్థమగుటఁ గాంచఁగలము. పిదప మూఁడు సం వత్సరములు గడచెను.

ఒకనాటిరాత్రి శ్రీమంతుఁడగునొక వైశ్యునింట హరికథాకాల క్షేపము జరిగెను. హరికథలు, నాటకములు, భజనలు ననిన లింగ మూర్తిగారికిఁ బ్రియమగుటచే నాఁటిరేయి జరుగు హరికధ వినుటకు వీరును దమజట్టుబాలురతోఁ గూడి వెళ్ళిరి. హరిదాసు కథాసమయ మున మానసిక పూజా విధానంబును దాని నాచరించిన భక్తుని చరి తంబును నుపాఖ్యానముగ నీవిధముగ నుపన్యసించిరి. "ఆర్యులారా! నిర్గుణుఁడును, నిరాకారుఁడును, నిర్వికారుఁడును, నిర్లిప్తుఁడును, నవ్య యుఁడునునగు నీశ్వరు నిట్లని నుతింప, నూహింపఁ, బూజింప శక్యము గాదు. కనుక నే పరమేశ్వరు నొకరూపముగా భావించి యారాధిం తుము. నిర్గుణపరబ్రహ్మోపాసనము జ్ఞానులుమాత్రమే చేయఁజాలు దురు. తక్కంగల మానవకోటి పరమాత్మని సృష్టిదృశ్యముల, విగ్రహముల వేదపుస్తకముల నారాధింతురు. ఇట్టియారాధనలకెల్ల మానసికారాధనము శ్రేష్ఠము.

"ప్రాతఃశుద్ధ తనుర్భూత్వా శౌచాదిభి రతన్ద్రితః
వివిక్త దేశమాశ్రిత్య, ధ్యానపూజాం సమారభేత్
నాభికణ్ఠే సముద్భూతం కదళీకుసుమోపమమ్
అష్టపత్రం స్నిగ్ధవర్ణం ధ్యాయేద్ధృదయపంకజమ్.

దీని నవలంబింపఁగోరు భక్తుఁడు ప్రాతఃకాలోచిత కర్మల నెల్లఁ దీర్చుకొని, స్నాతుఁడై, విజనప్రదేశమున సుఖాసనముఁ గల్పించుకొని శిరోగ్రీవకాయముల సమానముగఁజేసి నిమీలిత లోచనుఁడై తన మనస్సును నాభికంఠములమధ్య నధోముఖముగ కదళీకుసుమాకార ముననుండు ముకుళితహృదయపద్మమున నిలుపవలెను. ఆ ముకుళిత పద్మమును దన యిష్టదైవముయొక్క నామ, లేక మంత్రస్మరణముచే

నష్టసువర్ణదళములు గలిగి వికసించిన దానిఁగా నొనర్చి యూర్ధ్వ ముఖముగా దీనిం ద్రిప్పినట్లు భావించవలయును. అందు వజ్రఖచిత సింహాసన మమర్చి తమ దైవమును బ్రతిష్ఠింపవలయును.

సుస్థిరుఁడై యభిముఖుఁడై యున్న పరమేశ్వరు భక్తితాత్పర్య ములతో నర్ఘ్యపాద్యాది సకలోపచారములు సలిపి నైవేద్య నీరాజ నంబుల నమర్చి నామస్మరణగాని మంత్రస్మరణగాని చేయుచు స్వామిని జాతిపుష్పములచేఁ బూజచేయునట్లు భావింపవలయును. ఇట్లు కొంత కాల మాచరించిన మనంబు పరమేశ్వరు పాదపద్మములందు లగ్న మగును. అది లభించిన చిత్తశాంతి కలుగును. శాంతియే సుఖము; ఆనందము. ద్వాపరమున లీలావతారుఁడగు శ్రీకృష్ణపరబ్రహ్మ యీ మానసిక పూజోత్కృష్టత నిదర్శనపూర్వకముగ స్పష్టపఱచెను.

భారతవీరులగు పాండవసోదరులలో భీముఁడొక్కరుఁడు దక్క మిగిలిన నలుగురును భగవదర్చనోపవాసాదిసత్కర్మ లాచరించు చుండిరి. భీముఁడు బాహ్యపూజోపవాసాదుల జోలికిఁ బోక జంతు సామాన్య కర్మలయందు నిమగ్నుఁడై కాలము వెళ్ళించుటఁ గాంచిన రాంశ సంభూతుం డగు యర్జునునికిఁ గంటకముగాఁ దోఁచి, పాండవ పక్షపాతియని బిరుదువహించిన తమ హితైషియు మేనమఱందియు నగు శ్రీకృష్ణుఁడైనఁ దనయన్నగారి ప్రకృతిమోహమును బాపరైరిగాయని సుక్కుచుండెను. ఇట్లు కొంతకాలము గడచినవెనుక యోగీశ్వరుం డగు శ్రీష్ణుఁడు పార్థునిమాఢ్యముఁ బాప నెంచి "కైలాసమునకుం జని పరమేశ్వరు దర్శించి వత్తము ర"మ్మని, యందుల కియ్యకొనిన యర్జు నుంగూడి కైలాసమున కేగెను.

కొంతదవ్వరిగినంతఁ బర్వతాకారములై గగన చుంబితములై యెదుటఁ గన్పట్టు పూజానిర్మాల్యంపుఁ గుప్పలను దండోపతండంబు లుగ బారులుతీరి నిర్మాల్యమును మోయు ప్రమథగణములను గాంచి సవ్యసాచి శ్రీకృష్ణు నా నిర్మాల్య విధం బెఱిఁగింప వేడెను.

సర్వజ్ఞుఁడయ్యు హరి యొక ప్రమథుం జేరఁబిలిచి యీనిర్మా ల్య మెక్కడి దని ప్రశ్నింప, నతఁడు కౌంతేయమధ్యముం డగు

భీముఁడు దేవు నర్చించిన నిర్మాల్యంబనియు దనకు కాలయాపనఁ జేయు తీరిక లేదనియుఁ జెప్పి చనియెను. అర్జునుఁడు పరమాశ్చర్యచకితుఁ డయ్యెను. ఎన్నఁడును భీముఁ డీశ్వరుఁ బూజించుటఁ దాఁజూచి యెఱుఁగఁడు. కాన దాని భావము నెఱింగింపఁ దన బావ నడిగెను. భగవానుఁ డంత "అర్జునా! భీముఁడు మానసిక పూజాధురంధరుఁడు. దాని కాచారాది బాహ్య నియమము లవసరముండదు. సర్వాత్ము నీశ్వరు నర్చింప నింతకంటె నుత్కృష్టమార్గము వేఱొండు లే"దని యానతిచ్చెను.

ఇట్లు వీరు సంభాషించుచుండ నొక ముదుసలి చిన్న గంప యందుఁ బత్రిపుష్పాది పూజాద్రవ్యంబులఁ గొనిరాఁ గాంచి ముకుందుఁడు "అయ్యా! ఈ నిర్మాల్యం బెక్కడి"దన నవ్వృద్ధపరిమధుఁడు విసిఁగికొనుచు "భూలోకమునఁ బాండవ మధ్యముఁ డర్జునుఁడు భగవంతు నర్చించిన పూజాద్రవ్యంబు కొంచెమగుట నాపాలికి వచ్చిన" దని పలికి తనపనిమీఁదం జనియెను. పార్థుఁ డదివిని రిచ్చవడి భీముఁడు మానసికపూజ నొనర్చుటచేఁ దనకంటె వయస్సునఁనేకాక యాముష్మిక సముపార్జనమునను మిన్నయనియు బాహ్యానిష్ఠలతోఁ దాఁ జేసిన యర్చనకంటెఁ దనయగ్రజుఁడొనర్చిన మానసికపూజ సాటిలేని విలువగలదనియు నెఱింగి తనమనంబున నెలకొనియున్న సందియముఁ దీర్చుకొని వార్ష్ణేయునియెడఁ గృతజ్ఞుఁడయ్యెను. నాఁటు మొదలినుమడించిన గౌరవముఁ బవనాత్మజునెడఁ జూప మొదలిడెను.

ఆర్యులారా! భగవంతుఁడు మనకుఁ బ్రసాదించిన మనోవాక్కాయంబుల మనస్సు ప్రధానమైనది. మనసుండినచోటనే మానవుఁడుండు ననుట లోకప్రసిద్ధము. అట్టి చిత్తము నీశ్వరుఁ బాదకమలములందు భద్రపఱచుటకు బాహ్యాడంబరములు, విగ్రహారాధనలు, వ్రతములు, నియమనిష్ఠలు మార్గములు. వీని ప్రయోజనము చిత్తము దైవమునందు సుస్థిరమైనంతనే తీరు—ననిహారికథకుఁ డుపన్యసించెను.

ఆ కథను వినినంతనే సున్నితమును సూక్ష్మ గాను విశాలమును నగు శ్రీదాసుగారి బాలమనంబునందు మానసికపూజామాహాత్మ్యము

నాటుకొనిపోయెను. అప్పటనుండియే వీరు మానసికపూజఁ గావింప మొదలిడిరి.

భాగవతపరసమునం దభిరుచి గల్గెను. అందుఁ బ్రహ్లాదచరిత్ర మనిన వీరి కభిమానము మెండు.

క్రమక్రమమున వీరికాలము చాలభాగము మానసికపూజ యందే గడచుచుండెను.

వీ రిప్పటికిని బాహ్యాడంబరముల నాచారాదులఁ బాటింపక, బాహ్యాడంబర నిరతులచేతను, నసూయాపరులచేతను విమర్శింపఁ బడుట మున్ముందుఁ గాంచఁగలము.

ఒకపర్యాయము వినినంతనే సత్కర్మలయందు బుద్ధి నిలుచుట పూర్వజన్మ సుకృతమునఁగాని కలుగదు. గత జన్మంబున దైవోపాసనము యోగము జ్ఞానము సిద్ధింపకమున్నె కాయము వాసి, తిరిగి జన్మించినవారి కిట్టి స్వల్పావకాశముచేఁ దమ నైజకర్మానుష్ఠానపరత్వము తటస్థించును. భగవద్గీతలయందు శ్రీకృష్ణుఁడు.

"పార్థ నైవేహ నాముత్ర వినాశ స్తస్య విద్యతే
నహి కళ్యాణకృత్కశ్చి ద్దుర్గతిం తాత గచ్ఛతి."
"ప్రాప్య పుణ్యకృతాం ల్లోకా నుషిత్వా శాశ్వతీ స్సమాః
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోభిజాయతే."
"అథవా యోగినామేవ కులే భవతి ధీమతాం
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మయదీదృశమ్."
తత్రతం బుద్ధిసంయోగం లభతే పౌర్వదైహికం
యతతే చ తతో భూయ స్సంసిద్ధౌ కురునందన॥

"పార్థా! అట్టి యోగభ్రష్టున కీ లోకమందుఁగాని పరలోకమందుఁగాని నాశనములేదు. నాయనా! కళ్యాణమార్గము ననుసరించువాఁ డెన్నఁడైన దుర్గతిఁ బొందునా? పుణ్యాత్ము లేస్థానమును బొందుదురో యట్టి స్థలమునకే యోగభ్రష్టుఁడును బోయి దీర్ఘకాల మచ్చట వసించి పిదపఁ బవిత్రులును సాధనసంపన్నులును జ్ఞానంప

న్నులును నగు యోగులకులమందే జన్మించుచున్నాఁడు. నిశ్చయము గాఁ బ్రపంచమునం దిట్టి జన్మ వచ్చుట కడుదుర్లభము. ఆ యోగికులమందు వానికిఁ బూర్వజన్మ సంచితమగు బుద్ధిసంస్కారములు లభించును. వాఁ డప్పటినుండి మోక్షముకొఱకుఁ బ్రయత్నించును.

అట్టివారు కనుకనే మనదాసుగారు యోగ్యులు, సదాచార సంపన్నులు, భక్తులు, కులీనులు నగు తలిదండ్రుల కుద్భవించుటయు నొక పర్యాయము హరిదాసుగారి యుపన్యాసము వినినంతనే కష్టసాధ్యమగు మానసికపూజ నలవఱచుకొనుటయు జరిగెను.

---

## ౪. కలకత్తాప్రయాణము.

చ॥ చలమున బుద్ధిమంతులగు సాధులు నాహృదయంబు లీల దొంగిలికొని పోవుచుందురు రకిల్బిషభక్తి లతాచయంబులన్
నిలువఁగఁ బట్టి కట్టుదురు నేరుపుతో మదకుంభికైవడిన్
వలబకుఁ జిక్కి భక్తజనవత్సలతం జనుచుందుఁ దాపసా!

ఆ॥ వె॥ "నాకు మేలుఁగోర నాభక్తులకకాని
భక్తజనుల కేన పరమగతియు
భక్తుఁడొందుఁ జనినఁ బరతెంతు వెనువెంట
గోవువెంట దగులు కోడెభంగి."

—(భాగవతము)

పరమేశ్వరునిలీలలట్లు మహాభక్తుల జీవితము లతి విచిత్రములు, ఎట్టి యిక్కట్టులకు లోనైనను గోవువెంటదగులు కోడెవలె దను నమ్మినవారికి దోడుసీడయై శ్రీవల్లభుఁడు ప్రతినిమేషము రక్షించుచుండును.

మన దాసుగారు స్కూలుఫయినల్ చదువుచున్నప్పు డొక దినమున జన్మస్థానమైన ఉప్పుమాకయందలి శ్రీ వేంకటేశ్వరు బ్రహ్మోత్సవముఁ జూడఁబోఁ దటస్థించెను. అట్టి సమయంబున వికలాంగులు,

రోగపీడితులు, నసహాయులు నగు యాచకులు గుమిగూడియుండుట మనకుఁ గ్రొత్తకాదు. ఈ యాచకుల దుస్థితి భక్తియుక్త మగు దాసుగారి మనంబును గలంచివైచెను. దీనితో వీరి కొకవిధ మైన వైరాగ్య ముదయింప, నిట్టిదుఃఖములకు లోనుగాకుండు పథముఁ ద్రొక్క నభిలషించి ప్రపంచము వదలి పావనంబును, హిమవత్పర్వత పార్శ్వస్థితంబును, నగు బ్రహ్మకపాలమున కరిగి పరమేశు భజియింప నిశ్చయించెను.

వెంటనే కాకినాడకుఁ జదువవెళ్లుదు మని జనకునియొద్ద వేతనాదికములకుఁ గొలఁదిపాటి ధనముఁ బుచ్చుకొని సింహాచలమునకుఁ జేరిరి. అచ్చటనుండి శ్రీజగన్నాథు దర్శించి కాశీ చేరు తలంపుతో నొకనాఁటి సాయంసమయమునఁ గలకత్తా రైలుస్టేషనులో దిగిరి. అప్పటికేఁ డెనిమిదిగంట లయ్యెను. పల్లెగ్రామములనుండి వెళ్లినజనులకుఁ గలకత్తా యొకభయంకరారణ్యమువలెఁ గన్పట్టును. దాసుగారు బాలుఁడు. ఇంటిని నాప్తులను విడుచుట కిదియే ప్రథమము. దేశము క్రొత్త; భాష క్రొత్త; మనుష్యులు క్రొత్త. దాన వీరు రైలుస్టేషనులో నే యారాత్రిఁ గడుప నెంచి యాకలిబాధ యధికముగా నుండుటచేఁ దమయొద్ద సిల్వయున్న మూఁడణాల మూఁడుకానులు మిఠాయి యంగడిమార్వాడీ రొయొద్ద వెచ్చించి పొట్టనింపుకొని స్టేషనులో నొకమూల నొదిగి నిద్రించెను.

మఱునాఁ డుదయమున మేల్కాంచి పట్టణముఁ జేరఁదలఁచి మార్వాడి వర్తకునితో వచ్చియురాని హిందూస్థానీ భాషతోఁ గాళీదేవాలయమునకు మార్గ మడుగ వర్తకుఁడు బాలుని యల్పప్రాయమును, జేత కాసు లేమియు, పట్టణముల "కాసు లేనివాఁడు వీసము చేయమి" యుఁ జింతించి, కనికరించి తనయొద్దనే రెండుమూఁడు దినము లుంచుకొనెను.

వీ రొక ప్లాట్‌ఫారముపైఁ బచారుచేయుచుండ నొక శ్రీమంతుఁడు వీరిం గాంచి ప్రశ్నించి, యుదంత మరసి తనయాతిథ్య మంగీకరింపుఁ డని కోరెను.

దాసుగారు వల్లెయని యంగడివానియనుజ్ఞఁ బడసి క్రొత్తవానింగూడి పట్టణమున కరిగెను. శ్రీమంతుఁ డొకహర్మ్యంబున వీరిని డించి యుపచరించుటకొక బాలికను నియమించెను. అబ్బాల యతి భక్తి శ్రద్ధల నాతిథ్య మొసఁగి సర్వవిధముల నాదరించుచుండెను. ఇట్లు కొంతకాలము సనినపిదప నబ్బాలిక సహజమనోల్లాసమును బాసి విషాదచ్ఛాయనొందిన ముఖమండలముం దాసుగారు గాంచి కారణ మడుగ నామె మోమోటమింజేసి మిన్నకుండెను.

వీ రంతటితో నూరకుండక బ్రతిమాలి బుజ్జగించి యడుగ నామెతనయుదంతమును విషాదకారణమును నీవిధమున వెలిఁబుచ్చెను.

"అయ్యా! మిమ్ముల నాదరించి యాతిథ్యమిచ్చువారు నాపితృవ్యులు. దౌర్భాగ్యమున వీరికి శక్తిపూజ యబ్బెను. లోకమాత యగు భవానికి నరబలియన్న మిక్కిలి యిష్టమని వీరి తలంపు కను కనే లోభియయ్యు మిమ్ముఁ గాళికి బలినొసంగ నిట్లాదరించుచున్నాఁడు. నేను స్త్రీనగుటచేతను దైవప్రేరణచేతను బరమేశ్వరి కరుణామయి యనియు, నరుని రక్తమాంసము లెప్పట్టుననైనఁ గోరదనియు నమ్మిన దాన నగుటవల్లను, లోకమాతకు నినుఁబోలు లోకానుభవ శూన్యుఁ డగుబాలు బలినియ్యనుండ నాహృదయము కలతనొందినది. మనమున కూరట గలుగకున్నది. ఎట్టులేని నిన్నీ దుర్మరణమునుండి తప్పింప నాలోచించుచుంటిని. ఉపాయ మారయఁజాలక చింతించుచుంటిని. నా దుఃఖకారణ మింతియ. నా చెప్పిన చొప్పున వర్తింతువేని నీ ప్రాణము నా మానము దక్కు" నని యేదో దాసుగారికి రహస్య ముపదేశించెను.

భయంకరవార్త వినియుఁ జలింపని మనంబున దాసుగారు బాలికకుఁ గృతజ్ఞతఁ దెలిపి, శ్రీకాళీమాతయే తస్త్రీరూపమున నుద్ధరింప సమకట్టిన దని భావించి, బాలిక నుడివినరీతి నడచుకొనుట కంగీకరించెను.

మరునాఁడు లింగమూర్తిగారు తమ కొక సోదరుఁ డుండె ననియు, నతఁడును దనకొఱకువచ్చి వెదకుచుండు ననియు నతని

గూడ గొనివచ్చిన సంతస మనియు గృహస్థుం బ్రోత్సహింప నొకరి కిచ్చిరు బలిపశువులు దొఱకుట కాళీదేవియవ్యాజకరుణగా భావించి దాసుగారినిఁ దమ మోటారునం దెక్కించుకొని పట్టణవీధులగుండా రైలుస్టేషనుకు బయలుదేరెను.

మార్గమున నొక మోటారులోఁ గొందఱు తెల్లవారు వచ్చుటఁ గాంచి దాసుగారు బొబ్బలిడఁ బ్రారంభించిరి. ఆదొరలు తమబండి నాపి వీరిబండి నాపించి రోదనకారణ మడుగ, "అయ్యా! మాది యాంధ్రదేశము. ఈ శ్రీమంతుఁడీ గ్రామమునకుఁ గ్రొత్తనగు నన్నాద రించి యొక మాసమునుండి పోషించుచున్నారు. నేఁ జనుట కాజ్ఞ నిమ్మన్న విడనొల్లకున్నారు. ఏదేని యుద్యోగ మిప్పింతు మందురు. నేను మాగ్రామమునకుఁ బోకున్న దిగులుచేఁ జావవలసినవాఁడ నగు దును. తాము దయయుంచి వీరి నొప్పించి నన్ను నాస్వదేశమున కను పుఁ"డని యాతనిదుశ్చింత వెలిబుచ్చక తమతరణోపాయ ముద్దేశించిరి.

దైవవశమున నపరాధపరిశోధకారి యగు నా తెల్లదొర యా శ్రీమంతుని మందలించి రైలునొద్దకుఁ దమశకటంబునఁ గొనివచ్చి కాకినాడకు టికెట్టుఁ గొనియిచ్చి రైలులో నెక్కించి వెళ్లెను.

దాసుగారును దైవమును వేవిధంబుల నుతించుచుఁ దాఁ జిన్న నాఁటినుండి మనమున నారాధించు వేంకటేశ్వరుఁడే తన్నీవిధమున దుర్మరణమునుండి తప్పించె నని భావించి సకాలమున కాకినాడకుఁ జేరి యా సంవత్సరముననే స్కూలుఫైనల్ పరీక్షయం దుత్తీర్ణులైరి.

తొల్లి దుర్వాసుని శక్తిబారినుండి భక్తుఁడగు నంబరీషుని భగవానుఁడు రక్షించినట్లు భాగవతమందు వివరింపఁబడినది. అయ్యది యుగములకిందటి చరిత్రయని యజ్ఞులు నమ్మకుండిన నీయుగమునను బరమేశ్వరుఁడు భక్తుల భవాబ్ధినుండి నాపత్సముద్రము నుండి యుద్ధ రింప వేచియుండు ననుటకు దాసుగారిచరిత్రము దృష్టాంతము.

## ౫. వివాహము - ఉద్యోగము.

పూర్వ మొకప్పుడు భారతమాత దీర్ఘక్షామబాధిత యైనతఱి దక్షిణదేశమునగల ముని లందఱుఁ దిండిలేక ఋషిసత్తముఁ డగు గౌతము నాశ్రయించిరి. అతఁడును దన తపోమహిమచేఁ బ్రతిదిన మొక వరిచేనుఁ బండించి మునుల కాతిథ్య మొసంగి సత్కరించు చుండెను. గౌతమఋషి తన యాశ్రమముననున్న యల్పసంఖ్యాకులఁ బోషించు చుండుటయు, మిగతజను లన్నోదకములులేక మాడుచుండుటయుఁ గాంచి మునులు గౌతమ మునితపఃప్రభావ మనుభవపూర్వకముగఁ గాంచినవారగుటచే లోకకల్యాణమునకై యొక్కయుక్తిఁ బన్నిరి. తమ యోగశక్తిచే నొక గోవును సృష్టించి యొకనాఁడా వరిచేను మేపిరి. ఆశ్రమమం దంద ఱుపవసించిరి. మఱునాఁడును ముని లట్లు తమ యోగడమును మానక వరిచేను మేపుచుండ గౌతముఁడు గోవుపై నొక దర్భను విసరెను. ఆ యావు విగతాసు వయ్యెను. మునులు తమ సంకల్పము నెఱవేరినందులకు హర్షించి గోహత్యాపాపముఁ బాపుకొనువఱకుఁ దా మాతని యాతిథ్య మంగీకరింపఁజాల మనిరి. అంత గౌతముఁడు సదాశివుఁ బ్రార్థించి గంగను గొనివచ్చి గోవు మరణించిన స్థలముపైఁ బ్రవహింపఁజేసెను. ఆజలాధారమున దేశ క్షామము బాయునని యమందానంద మొందు తపస్వుల గోహత్యా పాపము దీరిన గౌతముఁ డాదరించెను. గౌతమమహామునిచేఁ గొని రాఁబడుటచే నాసరిత్తి గౌతమినాఁ బ్రసిద్ధిఁజెందె.

ఈనది తాఁ బ్రవహించు దేశమును సుభిక్షమొనర్ప మునులు తమతమ నెలవుల కరిగిరి.

ఈనది బొంబాయి రాజధాని యందలి నాశికా త్ర్యంబక క్షేత్రమునం దుత్పన్నమై పరమపవిత్రమును దీరస్థ పంచవటీక్షేత్రం బును, కలియుగ వైకుంఠమును, శ్రీరామచంద్ర నిలయంబును, రామదాస వందితదేవ దేవావాసమును, భద్రవరదంబుననగు భద్రా చల మాహాత్మ్యమునుమువ్వారి వడఁజేసి పాపికొండలను ఛేదించుకొని

యగాధంబై తూర్పుచాళుక్య రాజధానియు, భారతనిర్మాణ స్థానంబును నగు రాజమహేంద్రవరమును సమీపించి, యచ్చటనుండి యేడుపాయలై సముద్రమునఁ గలియుచున్నది. ఒక్కొక్కపాయకు మధ్య ఫలవంతము లగు పెద్ద పెద్దలంకలును, సంపదలతోఁ దులఁదూగు గ్రామములును పెక్కులు కలవు.

ఇట్టి గ్రామంబులలో విఘ్నేశ్వరంబొక్కటి ఇది వశిష్ఠగోదావరి యొడ్డున నున్నది. ఇచ్చట నది కొక యానకట్టయు లాకులును గట్టఁబడి నరసాపురంకాలువ త్రవ్వబడియున్నది. దృశ్యము మిగుల రమణీయము, మనోజ్ఞము నై నేత్రానందముగ నుండును.

ఈ గ్రామకరణము వృద్ధుల కటచే వారియల్లుఁడును, విశాఖపట్టణ మండలాంతర్గతమగు నొంటిమామిడిగ్రామ నివాసియు నగు నెట్టిమిల్లి వేంకటాచలమయ్యగారు కరిణీకము చేయుచుందురు. వీరు కులీనులు; నిరాడంబర జీవనులు; వేదాధ్యయనసంపన్నులు. వీ రధ్యయనము సలుపునపుడు శ్రోత లానందమున నోలలాడుదురు. వీరికి స్త్రీ పురుష సంతానము కలదు. అందు జ్యేష్ఠపుత్రికయగు సంగమేశ్వరమ్మను దాసుగారి కొసఁగి 1914 సంవత్సరమున వివాహ మొనర్చిరి. ఆ మహాసాధ్వియు సముద్రమునఁ బడిన వడగండ్లవలె దాసుగారి మనంబున లీనమయ్యెను.

లింగమూర్తిగారు 1914 సంవత్సరమునఁ దమ విద్యాభ్యాసమును ముగించి యుద్యోగమునకు యత్నించి పలుతావుల విఫలులైరి. ఒకరోజు కాకినాడ రైలుస్టేషనుకు షికారుకు రాగా నగుపడిన బాల్య మిత్రునితోఁ బ్రసంగించుచుండిరి.

ఇంతలో నా స్నేహితుని జనకులును, డిప్యూటికలెక్టరు పదవియం దున్నవారును, ప్రస్తుతము కాకినాడనుండి కర్నూలుకు మార్పబడినవారును నగు నిట్టల రామమూర్తినాయుడుగారు వీరినిఁజూచి తమ తనయు నడిగి తెలిసికొని, తాము చనునున్న కర్నూలు మండలమునకు వచ్చిన నుద్యోగ మిప్పింతుమని సెలవిచ్చిరి.

1915 లో దాసుగారు శ్రీ నాయుడుగారి వాత్సల్యమున ద్రోణాచలం తాలూకాఆఫీసులో గుమాస్తాగాఁ బ్రవేశించిరి. అప్పటి నుండి మార్కాపురము మొదలగు పలుతావులఁ బనిఁజేసి 1919 లో రివిన్యూ ఇన్‌స్పెక్టరుగా నియమింపఁబడిరి.

పిదప 1922 లో సెటిల్‌మెంటు రివిన్యూ ఇన్‌స్పెక్టరుగా అనంతపుర మండలమునకు మార్చఁబడిరి. అచ్చట వీరు పుష్కలముగా ధన మార్జించి సర్వసౌఖ్యము లనుభవించుచు

"జనక గురుల నైనఁ జంపు నర్థమునకై
ప్రాణమైనవిడుచు భార్యకొఱకు
నట్టి భార్య పురుషు డతిథిశుశ్రూషఁ జే
యించి గెలుచు నజితు నీశు నైన."

అను భాగవతధర్మమునూహించి యతిథి యభ్యాగతుల నాదరించుచు సుఖముగఁ గాలము గడుపుచుండిరి. వీరి కిప్పటికి రాముఁడు, త్రిపురసుందరి, కృష్ణుఁడు నను ముగ్గురుబిడ్డలు జనించిరి.

కామినీ కాంచనముల రెంటిని జయించిననే పరమేశ్వరసాక్షాత్కార మబ్బును. ఈరెండును మహాపురుషుల నైన నజ్ఞులనొనర్పఁ జాలినవి. విశ్వామిత్రాది మహర్షులు నైత మైహికభోగముల రోసి, విరాగులై కొండల నాశ్రయించి, యినుపకచ్ఛడముల బిగించికట్టి, యుగ్రతపముఁజేయుచు నీ రెంటియొక్క శక్తి నతిక్రమింపలే కుండిరన, సాధారణగృహస్థులయవస్థఁ జెప్ప నక్కఱయే యుండదు. దాసుగారును గామదాసుగా స్వల్పకాలము మారిరి. కారణజన్ములగు మహాపురుషుఁడు గనుక గాధిసూనురీతిఁ దాత్కాలిక మోహాము నుండి బయటఁబడఁ గలిగిరి. మహాత్ముల చరిత్రము లెందును విపరీతములు విచిత్రములు. అనేకవత్సరములు కామియై కామినీసేవ నొనర్చిన వేమన, యొక్క క్షణములో విరాగియై పరమజ్ఞాన మంది వేమనయోగిగా మారెను. అట్టులే దాసుగారి నడతయుఁ బరివర్తన మందెను.

ఇప్పటినుండియే దాసుగారు యథార్థముగ లోకసేవ నొనర్పఁ గడఁగుటచే దాసుగారను నామము సార్థకమైనది.

---

## ౬. దిగంబరస్వామి

బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్న్యాసాశ్రమముల నాల్గింటిలోఁ గడపటియాశ్రమము మిగులఁ గష్టతమము. అసిధారావ్రతమువంటిది. దీనంగల నియమములు పెక్కు లవలంబింప సుగమములుగావు. దృష్టిపూతముగా నడుగిడవలయు. వస్త్రపూతజలము ద్రాగవలయును. సత్యపూత వచనము బలుకవలయును. మనఃపూత కార్య మాచరింపవలయును. భిక్షాన్నముఁ దినవలయును. నిస్సంగుఁడై నియమితేంద్రియుఁడై యాత్మరతుఁడై సమదర్శనుఁడై యొక్కరుండ, యిమ్మహిఁ గ్రుమ్మరుచు విజనస్థలంబున విడియుచుండవలయును. ఇట్టి యతులలోఁ బరమహంస యుత్కృష్టుఁడు. అతఁడు విద్వాంసుఁడయ్యు బాలునిరీతిఁ గ్రీడించు, నిపుణుఁడయ్యు జడునివడువున వర్తించు, పండితుఁడయ్యు నున్మత్తురీతిం భాషించు, వేదార్థనిష్ఠుఁడయ్యు ననియతాచార మవలంబించు. మహాత్ములగు పరమహంసలు లోకము గుర్తింపకుండునట్లు బాలురీతి నున్మత్త భంగి మూఁకవిధంబున పిశాచంబుల చాడ్పున దిగంబరులుగ గ్రుమ్మరుచుందురు.

అనంతపురము జిల్లా బెల్లుప్ప యను గ్రామమున నొకదినమున నొక పిచ్చివాఁడు, దిగంబరి వచ్చి చేరెను. నల్లనిశరీరచ్ఛాయయు, జడలుగట్టిన శిరోజములును, వజ్రనిర్మితమో యనదగు శరీరపటుత్వమును, గలిగి చూపరులను భీతిఁ గొలుపుచుండెను. వీనింజూచినంతనే బాలురును బిచ్చియెత్తి వెంటాడిరి. గ్రామమునఁ గల పిన్న పెద్దలు పందలకొలఁది దిగంబరునిచుట్టు మూఁగిరి. ఒక కమ్మరివాఁడు కత్తులు గాయుచుండ దిగంబరిని నిష్కారణముగ నాకత్తులఁదన శరీరమున కంటించుకొనిన నాపద వొరయకుంటఁ గాంచి పిచ్చి దిగంబరిని దిగంబరస్వామిగ భావించిరి. అతఁ డట్టుల బహుజనపరివృతుఁడై వీధుల

ద్రిమ్మరుచు నొక దేవాలయసమీపమున కనుదెంచెను. పల్లెటూళ్లలోఁ బ్రభుత్వోద్యోగీయులు దేవాలయమండపములయందు విడియుట యాచారముగాన సెటిల్మెంటు రివిన్యూఇన్స్పెక్టరుగా రగు మన దాసుగా రాదేవాలయమున విడిసియుండిరి.

అప్పుడే పొలమునుండి వచ్చినవీరు పెద్దగుంపుగమూగిన జనమును జూచుచు దేవాలయద్వారమున నిలువఁబడియుండిరి. జనాగ్రగామియగు దిగంబరి దాసుగారినిఁ జూచినంతనే మందహాసమొనరించి కరములఁజాచి యాలింగనముఁ గావించుకొని కౌగిటం బొదివి యొక వేదికపైఁ గొలఁదికాలము పరుండి కొంతసేపునకు దాసుగారిని విడిచి యెటకేనిం జనియె.

లింగమూర్తిగారును స్మృతిలేకయట్టులే యరుగుపైఁబడియుండి యొక గంటకుబిదప లేచునప్పటికి జనసమూహముగాని దిగంబరుఁడుగాని లేరు. ఒక రిద్దరుమాత్రము వీరిచెంత వేచియుండిరి.

తాము దిగంబరయోగి కౌగలించుకొనినంతనే స్మృతిఁ దప్పితిమనియు, నిందుఁ దమ కొక స్వప్నమయ్యె ననియు, నయ్యది తమ పూర్వజన్మవృత్తాంతమని తమకు స్ఫురించుచున్నదనియు, దాసుగారు దాపున వేఁచియున్నవారి కెఱింగించిరి.

తాము గాంచిన స్వప్నము నీరీతిఁ జెప్పిరి. ఒక భయంకరారణ్యమధ్యమున నొకపర్వతము. దానిమీద నొక కుటీరము. కొంతదూరమున నొకకోనేరు. దానిచెంత గొఱ్ఱెలమేపు నొక బాలుఁడు. ఇంతలో మార్గాయాసముచేఁ గడుబడలిన వృద్ధుని రాక.

ఆవృద్ధుఁడు బాలుని సమీపించి యాహారము నర్థించెను. బాలుఁడు పర్ణశాలంజూపి వృద్ధులగు తనతలిదండ్రులందరించి భోజనముఁ గూర్తురని వచించెను. వృద్ధుఁడా వృద్ధుల యాచించి విఫలమనోరథుండనైతి నని యెఱింగించెను. మూఁడుదినములుగా భోజనము లేదని వచించుచు నుస్సురని కూలఁబడియెను. బాలుఁడు జాలినొంది తనకు మధ్యాహ్న భోజనమునకుగా నుంచుకొనియున్న రొట్టెను

వెన్నను శీఘ్రముగ గొనివచ్చెను. ఆపాంథుఁడు మిగుల సంతసించి "నాకుసగముఱొట్టె తృప్తినొసంగఁగలదు. మిగతసగము నీవు భుజింపు" మని యిచ్చి తనభాగమును దిని యాకలిఁ దీర్చుకొని, "కుమారా! నీయుపకారబుద్ధికి నే మిగులసంతసించితి. ఈపుణ్యమువలన నీదేహాంత మందు మహోత్కృష్ట జన్మమంది వేలకొలఁది జనుల కిట్లే యుపకార మొనర్తువుగాక" యని దీవించి తనదారినిఁ బోయెను.

వీరికి స్మృతి కలిగినప్పటినుండియు మతి చలించినవానివలెఁ దోఁచు జను జనులం జేరి వారి భూతభవిష్యద్వర్తమానములఁ జెప్ప మొదలిడిరి.

ఇప్పటికి వీరి కిదివఱకున్న ముగ్గురు బిడ్డలుగాక కమల యను స్త్రీశిశువు పదునాల్గుదివసంబుల క్రింద జనించియుండెను. బాలెంత రాలగు వీరి ధర్మపత్ని సంగమేశ్వరమ్మ తమనాథుని మార్పుఁగాంచి పిచ్చియెత్తిన దని భయమంది, తమ తండ్రిగారికి తంతివార్త నంపి పిలిపించుకొనియెను. వారును జామాతృస్థితికి వగఁజెంది వీరిచే రెండు మాసములు సెలవుఁబెట్టించి తమ గ్రామమునకుఁ బిలుచుకొని వెళ్ళిరి.

ఈ రెండుమాసములలో శరీరము స్వస్థతఁజెంద వీరు తిరిగి యుద్యోగమునఁ బ్రవేశించిరి. భార్గవరాముని తేజము దశరథరాముని యందుఁ బ్రవేశించిన విధముగ దిగంబరస్వామివారి మాహాత్మ్యము దాసుగారియందుఁ జొచ్చి సుస్థిరముగ నిలిచెను.

లోకమున భక్తి శూన్యమగుటగాంచి తమ యాశ్రమ నియమముల ననుసరించి తామెట్టి సంబంధమును లోకముతోఁ బెట్టుకొన రామిచే కరుణాలుఁ డగు దిగంబరుఁడు దాసుగారిచేఁ దనసంకల్ప మీడేర్పనెంచి తమచిరకాలసముపార్జితయోగశక్తిని వీరికిఁ గటాక్షించి చనిరి. నాటఁగోలె లింగమూర్తిగారు పూర్తిగ పరిణామమొందిరి. లోకకళ్యాణముకొఱకుఁ దమకు దిగంబరస్వామి ప్రసాదించిన నూత్న తేజమును వినియోగింప నిశ్చయించెను. రాత్రింబవళ్లు వీరిచుట్టు జనులు గుంపులు గుంపులుగా మూగ నారంభించిరి.

---

# ౭. అన్న సత్రస్థాపనలు.

మనపూర్వు లొక్కొక్క రొక్కొక్క ధర్మము నామూలాగ్రముగఁ బాలించి యైహికాముష్మికముల నంది సుఖించిరి. హరిశ్చంద్ర చక్రవర్తి సత్యమును బాలించి సర్వకష్టముల నోర్చి యీశ్వరు మెప్పించె. దానశీలుఁడగు రఘుమహారాజు తనపత్నిని బ్రహ్మచారి రూపమున యాచించిన పరమేశ్వరున కర్పించి యీశ్వరకటాక్షమును బడసెను. శిబి కర్ణ దధీచులు తమప్రాణములను, ప్రాణప్రదములైన వస్తువులను ధారవోసిరి. రంతిదేవుఁడు రాజ్యచ్యుతుఁడయ్యును, ధనాభావదుఃఖము ననుభవించియు, నభ్యాగతిగఁ జేరిన చండాలునకు సైత మాహార మిడి విష్ణుప్రీతి నార్జించెను. అట్టివారు సర్వకాలముల సర్వదేశముల నాదర్శకపురుషులు. కనుక నే బలి వామనునకు పాదత్రయభూదానము గావించునపుడు కులగురువగు శుక్రాచార్యునిచే వారింపఁబడి.

"కారే రాజులు రాజ్యముల్ గలుగవే గర్వోన్నతిం బొందరే
వారేరీ సిరిమూఁటఁ గట్టుకొని పోవంజాలిరే భూమిపైఁ
బేరైనం గలదే శిబిప్రముఖులుం బ్రీతిన్ యశఃకాములై
యీరే కోర్కులు వారలన్ మరచిరే యిక్కాలమున్ భార్గవా."

అని చెప్పి దానమిచ్చెను.

దానములలో నెల్ల నన్నదానము సర్వజనసమాదరణీయము. ప్రాణముగల ప్రతిజంతువున కాహార మత్యవసరము. అన్నదానమునఁ గలుగు భూతతృప్తి మఱి యేదానమునను గలుగఁబోదు. ఎట్టి దురాశాగ్రస్తునైన నన్నదానమున దృప్తుంజేయఁగలము.

సహజముగ ననంతపుర మండలము బీదదేశము. తఱచు క్షామ బాధితము. 1923-24 సంవత్సరములయందు క్షామ మాజిల్లా యందుఁ జెలరేగి తాండవించెను. బీదలగు బహుజను లన్నోదకములు దొరకకపోవుటచే మలమల మాడి పలుకష్టములకు లోనుగావలసిన వారైరి.

కల్లగ్రామములం దీ కాటకబాధ మిక్కిలి కంటకమయ్యెను. లింగమూర్తిగారి హృదయము సహజముగ కోమలము, విశాలము. పిన్ననాఁటినుండి మానసికపూజ నొనర్చుటచే మఱింత సున్నితమయ్యెను.

"ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః."

"ఎవఁడు సర్వభూతసుఖదుఃఖములను దన సుఖదుఃఖములుగాఁ దలఁచునో యట్టి యోగి నాకు సమ్మతుఁడు, జ్ఞానులందఱియందు నుత్తముఁడు" నని భగవద్గీతయందు కృష్ణుఁడు వచించియున్నాఁడు. సర్వభూతహిత మాచరించుట భక్తుని ప్రధానలక్షణ మగుటచే లింగమూర్తిగారు బీదలదుఃఖముఁ దీర్ప సమకట్టిరి.

తా మేగిన ప్రతిగ్రామమునందును, శ్రీమంతులఁ బిలిపించి భక్తిభావము లుద్రేకించున ట్లుపన్యసించి, వారు భోజనముచేయు ముం దొక్కమానవునకు సరిపడు నాహారము నిత్య మొసఁగునట్లు ప్రమాణముఁ జేయించెడివారు. గ్రామమునందుండు కులీనుఁ డగు యాచకు నొకని నీ యాహార మడిగితెచ్చి తన కుటుంబమునకు సరిపడునది మిగుల్చుకొని శేషించిన పదార్థము నాగంతులగు పాంథుల కిడునట్లు నియమించెడువారు.

ఈ యేర్పాటువలన నెట్టి సంకటముగాని యాడంబరముగాని లేనందున నిప్పుడును వారిచే స్థాపింపఁబడిన యన్నసత్రములు జరుగుచునే యున్నవి. ఇట్లు వీరు పనిమీఁద వెళ్ళిన ప్రతిగ్రామమునను, నన్నదానము జరుగు నేర్పాటుఁ గావించిరి. పినాకిని పత్రికయందు వీరి యన్నసత్రస్థాపనలఁ గూర్చి యిట్లు ప్రకటింపఁబడియెను.

"పినాకిని" - ౧౯౨౪ ఏప్రిల్ ౧౨ తేది.

"లింగరాజు అనువారు సుమారు రెండుమాసముల క్రిందట సెటిల్‌మెంటు ఇనస్పెక్టరుగా నీప్రాంతములకు వచ్చినట్లు తెలియు

చున్నది. వీరు తిరిగిన పల్లెలలో ప్రతిచోటను నఖండమిత్రిత్వము దుర్జనరాహిత్యము సన్మార్గవర్తనము నుపదేశించుచున్నారు. ఇవిగాక వీరు ప్రతిపల్లెయందును, నిరంతరాన్నదానము జరుగునట్టి అన్నసత్రములు స్థాపించినారు. నేను కాంగ్రెసు ప్రచారమునకై కళ్యాణదుర్గము తాలూకాలో ప్రతిపల్లెయందును సంచరించుటచే నేడీ ముదిగల్లు గ్రామమునకు వచ్చినాను. ఇచ్చటకురాగానే నేజేయు పనులేమియు నాకగుపడలేదు. ఎందుకనగా గ్రామములోని ప్రజల యైకమత్యము, మిత్రిత్వము, అన్యోన్యసహోదరవాత్సల్యము, అసూయలేమి, పాపభీతి, ధర్మప్రవర్తనము జూడ నాకు చాల హర్షమైనది. ఇదివర కీలాటి గ్రామము నెచ్చటనుం జూచియుండలేదు. ఈయేర్పాటులన్నిటికిని కారణభూతు లెవరై యుండవచ్చునా యని విచారింపగా మన లింగరాజుగారి యసమాన తత్త్వోపదేశ మని తేటపడినది. ఈలింగరాజు తత్త్వోపదేశములన్నియు ముఖ్యముగా మూఁడు విషయములలో నిమిడియున్నవి. అవియేవనగా పరధనాపేక్ష పరస్త్రీగమనము పరస్పరశత్రుభావము వీనిని ఖండించి నిరంతరము ప్రతిమానవుఁడు సన్మార్గవర్తనుఁడై ధర్మచింతనమందుఁ దవిలి హింస, అసత్యము త్యజింపజేయుటయే వీరి ముఖ్యోద్దేశముగాఁ దోఁచుచున్నది. ఇట్టి తత్త్వమును వీరు ముందు అవలంబించి ప్రజలకు సదా బోధించుచుండుటచే ప్రజలకు వీరియందిట్టిఆకర్షణ కలుగుటకు కారణమని తోచుచున్నది. దీనివలననే వీ రీజిల్లాకువచ్చిన కొలఁది కాలముననే ఈక్షామకాలము ననుసరించి జరుగుచున్న పది అన్నసత్రములు స్థాపింపగలిగినా రని విన్నాను. నిన్నటిదినము పదునొకండవ సత్రము కళ్యాణదుర్గ లో స్థాపించిరి. ఈరీతిగా త్వరలోనే యీ జిల్లాలో ప్రతిగ్రామమునందును నిట్టి సత్రములను స్థాపించవలెనని ప్రయత్నము చేయుచున్నారని విన్నాను.

24-3-24 ముదిగల్లు, } (Sd) సాంపల్లి వేంకటరమణయ్య చౌదరి."

పినాకిని పత్రికయందుఁ బ్రకటింపఁబడిన రీతి వీరు నూటికి పైగా నన్నసత్ర స్థాపనలు గావించిరి. పిన్నపెద్దలు, ముఖ్యముగా బీద జనులు, వీరియెడఁ గృతజ్ఞులై భక్తిభావమున మెలఁగఁజొచ్చిరి.

---

## ౮. తారకమంత్రోపదేశము.

"రామతారక పావనరామ నామ
మెంత పాపంబు నడగించు నంత యఘము
శ్వపచు డైనను జేయగాఁ జాలఁ డనఁగఁ
దత్ప్రభావంబు నెన్నంగఁ దరమె నాకు."

"అనవరత రామనామకీర్తన పరుండు
వెనుకటి యఘంబులఁ దలంచి వెఱవవలదు
ఘనత నేనుఁగు నెక్కి కుక్క లను గాంచి
భయపడఁగ నేల మనుజుఁ డో పంకజాక్షి."

"నిరతంబు రామనామ। స్మరణంబునకంటె మోక్షసాధన మితరం
బరయంగ లేదు ధరలో।బరమసులభమైతగు సదుపాయం బబలా!"

(సీతారామాంజనేయము.)

తొల్లి యొకప్పుడు పార్వతీపరమేశ్వరు లేకాంతమున నున్నతఱిఁ బతింజూచి "నాథా! మీరు సర్వలోకాధిపతులు. సృష్టిస్థితిలయకార ణులు. మీరు సదా మనంబున నేదో ధ్యానించుచుండునట్లు దోఁచు. ఆధ్యానం బెట్టిదో చెప్పనగు నేని యానతీయ వలయు"నని గిరిజ వేడెను.

"అహర్నిశల యందును నను క్షణమును శ్రీరామ మంత్ర మను తారక మంత్రరాజమును జపించుచుందుదు. ఆ మంత్ర మాహా త్మ్యం బాకర్ణింపుము. కుక్కమాంసమును దిను చండాలుఁ డేనియు రామమంత్రము హరింపఁ జాలని పాపముఁ జేయఁ జాలఁ డన దాని ప్రభావ మిట్టిదని వర్ణింప నాకగునే! ఏనుఁగు నెక్కిన మనుజుఁడు కుక్కలఁగాంచి యేవిధముగ భయపడనవసరము లేదో యట్లే రామ

రామ జపపరాయణుఁడు తాను వెనుకఁజేసిన పాపములఁగూర్చి చింతింప నవసరములేదు. ప్రపంచమున నెంత వెదకినను రామనామ జపమున కంటె మోక్షసాధనము వేరొండులేదు. ఇది మిగుల సులభము." అని పరమేశ్వరుఁ డానతిచ్చెను.

ఆర్యులు 'ఓం నమోనారాయణాయ' యను నష్టాక్షరి మహామంత్రమునుండి 'రా'యను 'ఓంనమఃశివాయ' యను పంచాక్షరీ మంత్రమునుండి 'మ'యును దీసి 'రామ'యనిఁ తారక మంత్రమును గూర్చిరి. ఈ యక్షరద్వయము మంత్రద్వయమునకు జీవము అష్టాక్షరినుండి 'రా' ను దొలఁగించిన 'ఓం నమోనాయణాయ' యగును. అట్లులే శివమంత్రమునుండి మా నుదీసిన 'నశివాయ' యగును. రెండు మంత్రములును వికృతిఁజెంది యమంగళములుగఁ బరిణమించును.

కలియుగనారదుం డగు భక్తశిఖామణి త్యాగయ్యగారు "సీతారామా! నీయెడ బ్రేమరహితులకు నీనామరుచి తెలియునా?" యని గాన మొనర్చిరి. దీని మధురిమ భక్తుఁ డొక్కఁడే గ్రహింపఁ గలఁడు. గాంధిమహాత్ముఁడును తారకమును జపించి తరించుచున్నాఁడు.

రావణవధ నొనర్చి యయోధ్యంజేరి, పట్టాభిషిక్తుఁడై సీతా లక్ష్మణభరతశత్రుఘ్న సమేతుఁడై నిండోలగంబుననుండి తనకు యుద్ధమున సహాయము సలిపిన కపిభల్లూకములను, రాక్షసులను దగినరీతి బహూకరించి కపిశ్రేష్ఠుఁడును, నవవ్యాకరణవేత్తయు నను పమ భక్తుఁడును, రామకార్యధురంధరుండును నగు హనుమంతున కెట్టి బహుమతియు నొసంగక మిన్నకుండెను. సీతాదేవికి నాథుని చెయిదము రుచింపమిఁ, దనమెడనున్న ముక్తాహారమును జేతఁగొని యాంజనేయు నకిచ్చుటకు భర్తయాజ్ఞ నపేక్షింప శ్రీరాముఁ డంగీకరించెను. జానకి యా హారమును వాయునందనున కొసఁగెను.

దానిని భక్తితో నందుకొని వాయుసూనుఁడు హార మచ్చటనే తెంపి యొక్కొక్క ముత్యము నమలి యుమియుట సీతచూచి హనుమంతుని యవివేకమున కచ్చెరువంది జాతిగుణము మానలేకుండెనని

మెంచి విమనస్క యయ్యెను. శ్రీరాముఁ డామె మనోభావము నెఱింగి "ఆంజనేయా! జానకి ప్రీతితో నిచ్చిన నీ యమూల్యహార మిట్లేల బాడుసేయుచుంటి"వన "అయ్యా! ఈ ముత్యములయందు రామనామ మాధుర్య ముండు నేమోయని వెదకుచుంటి"నని బదులొసంగ సీత వానిభక్తి కచ్చెరువంది రాముఁ డేల యాతని నందఱుఁబోలె బహూకరింపనిదియు నెఱింగెను.

ఒక్కతూరి రామనామామృతమును జవిచూచిన భక్తునికిఁ దదితరములన్నియు వేమువలెఁ జేదుగఁదోఁచు. దీనిరుచిందవిలి యొడలుమరచి యానందమున దాండవము గావించినవార లెందఱో కలరు.

" 'రా'కలుషంబులెల్ల బయలంబడఁద్రోచిన 'మా' కవాటమై
దీకొని ప్రోచునిక్క మిది ధీయుతులెన్న, దదీయవర్ణనల్
గైకొని భక్తితో నుడువఁగానరుగాక విపత్పరంపరల్
దాకొను నే జగజ్జనుల దాశరథీ! కరుణాపయోనిధీ!
చిక్కనిపాలపై మిసిమిఁ జెందిన మీఁగడఁ బంచదారతో
మెక్కినభంగి నీ విమల మేచకనామసుధారసంబు నా
మక్కువ పళ్లెరంబను సమాహిత దాస్య మనేటి దోయిటన్
దక్కెనటంచు జుర్రెదను దాశరథీ! కరుణాపయోనిధీ! "

అని భద్రాద్రిరామదాసుగారు రామనామ మాహాత్మ్యమును, మధురిమయు దా మనుభవించిన విధమున వర్ణించిరి.

ఎట్టి మహాపురుషున కైనను జ్ఞానమబ్బవలెనన్న గురువు దొరకవలెను.

"గురువులేక నెటువంటి గుణికి గుదురఁబోదు జ్ఞాన"మని త్యాగయ్యగారు చాటినటుల నిట్టి మహామంత్రములు గురుముఖముగ లభించిననే యమూల్యమగును. లేనిచో నిట్టిమంత్రజప మొనర్చుట నిష్ఫలము. అందువల్లనే కబీరుదాసు రామానంద యోగిచేఁ బలునిడుములకు లోనై మంత్రమును సంపాదింప వలసివచ్చెను. ఇట్టి దివ్యమంత్రము మన దాసుగారి కప్రయత్నముగ నయాచితముగ దిగంబరయోగి యాలింగనమువలెనే లభ్యమయ్యెను. అదెట్లనిన,

పదిసంవత్సరముల వయస్సుగల బాలయోగియొకరు తనచుట్టు వందలకొలఁది జనులు మూగియుండ నొక యూరినుండి వేరొక యూరికిఁ బోవుచుండెను. ఆయూరివారందఱకు భోజనాదులఁ గూర్చుచుండిరి. అబ్బాలుఁడు శైశవక్రీడలందేలుచు నొకనాఁడు మన దాసుగారుండు చెట్టూరుగ్రామమున కరుదెంచి చెట్టున కొకయుయ్యాల వైచికొని యూగుచుండెను. దాసుగారు సైకిలుపై వెళ్లుచుండఁ బ్రతివారి 'నొరే'యని పిలుచు స్వభావముగల బాలయోగి 'ఒరే! ఇక్కడికి రారా!' యని వీరినిఁ బిలిచిరి. దిగంబరాలింగనమునాఁటి నుండియుఁ బ్రపంచమును లెక్కసేయని వీరు విసిగికొనుచు నితరుల ప్రోద్బలమున బాలునియొద్దకు వెళ్ళగా నతఁడు దాసుగారిని షికారునకు రమ్మని పిలిచిరి. తానొక గుఱ్ఱమునెక్కి దాసుగారు సైకిలుపై వెంటనడువ దాదాపు రెండుమైళ్లుపోయి యొక దిగుడుబావికడ దిగిరి.

పిదప దాసుగారి కేమయిన మంత్రములు వచ్చునా యని యడిగి రావని తెలిసికొని తారకమంత్రము నుపదేశించి యనుగ్రహించిరి.

తనచుట్టు రాత్రింబగళ్లు మూగి భక్తితో సకలోపచారంబు లొనర్చు వందలకొలఁది భక్తుల వదలి ప్రథమమునఁ దన చెంతకురా నిరాకరించిన దాసుగారికి మంత్రోపదేశమిచ్చుట యాశ్చర్యముకదా! కారణజన్ముల కిట్లే సర్వము సంఘటించును.

అదిమొదలు దాసుగారన్నసత్రస్థాపనలతోఁ దృప్తిపడక శ్రీరామ సప్తాహములు, దేవాలయ నిర్మాణములు, జీర్ణాలయోద్ధారణములు మున్నగు మహత్కార్యము లాచరింపఁ బ్రారంభించిరి.

తెల్లవారుఝామున రామభజన సలుపుచున్న కంచెర్ల గోపన్నను కబీరుదా సనుగ్రహించి రామమంత్రము నుపదేశించినటుల చిన్ననాఁటఁగోలెఁ దాఁజేయు మానసికపూజామహిమను దాసుగారి చిత్తము పక్వముకాగా భక్తుల నుద్ధరింప వేచియుండు పుండరీకాక్షుఁడు వీరి కీరీతి మంత్రోపదేశ మిప్పించెను.

# ౬. సప్తాహములు.

అభిమన్యుపుత్రుఁడగు పరీక్షితుఁ డొకనాఁడు వేఁటతమకంబున నడవులకరిగి మృగముల వధించి డస్సి యెచ్చటను జలాశయముఁ గానక శమీకమునియాశ్రమమునం జేరి యందుఁ గన్నులు మూసికొని సమాధియందుఁ గూర్చుండిన యమ్మునిం గాంచెను. భూపతియగు తనకు ముని యర్ఘ్యపాద్యాది యర్హమర్యాద లొనర్పకుండుటయుఁ, ద్రావ జలమర్థించియుఁ బ్రత్యుత్తరము బడయమిని, గినిసి, సమీపముననున్న యొక మృతోరగకళేబరమును వింటికొపున నెత్తి ముని మెడం దగిలించి హస్తినాపురముఁ జేరెను. శమీకపుత్రుఁడగు శృంగి మునిపుత్రులచేఁ దనతండ్రికి జరిగిన యపకృతిఁ దెలిసికొని కోపమున

"ఓడక వింటికొపున మృతోరగముంగొనివచ్చి మారుమా
టాడకయున్న మజ్జనకు నంసతలంబునఁబెట్టి దుర్మద
క్రీడఁ జరించురాజు హర కేశవు లాగినఁ జచ్చు నేఁటితో
నేడవనాఁడు తక్షకఫణీంద్రవిషానలహేతిసంహతిన్ ॥"

అని బెట్టిదమగు శాప మిచ్చెను.

వృద్ధముని సమాధిఁ జాలించి పుత్త్రశాపముఁ దెలిసికొని తనయు నధిక్షేపించి, కలిని ధిక్కరించి ధర్మంబును నాలుగు పాదంబుల నడపిన పరీక్షితు దుర్మరణమునకు వగచి, శాపముఁ బ్రమ్మరింప వినియోగించి, సాధ్యము కాకునికి శాపవృత్తాంతమును రాజునకుఁ దెలియఁజేసెను.

పరీక్షితుఁడు దాఁ జేసిన యవినయమునకుఁ జింతించి మునిశాప మనుభవింపక తీరదని త్రిలోకపూతయగు గంగాతీరమునఁ బ్రాయోపవిష్టుండగుటయు నలుదిశలనున్న మహర్షిపుంగవులు రాజునకు రానున్న దుర్మరణంబు విని తమసానుభూతిఁ దెలుపుటకు విచ్చేసిరి.

వారలకెల్ల నర్హమర్యాదల జరిపించి నమస్కరించి, "చూడుఁడు నాకళ్యాణము-పాడుఁడు గోవిందుమీఁది పాటలు, దయతో-నాడుఁడు హరిభక్తులకథ - లేడహములలోన ముక్తి కేగెద నిచటన్" అని మనవి

నలుప వారట్లు సప్తాహంబులు భాగవతము వినిపింప రాజు జ్ఞానమంది తరించెను.

కనుక ముముక్షుత్వ మపేక్షించువారు డేడురోజులలోనే విష్ణుం బూజించి ధ్యానించి తత్కథలాకర్ణించి తద్భక్తుల నాదరించి సేవించి చరితంబు లాలించి మోక్ష మందఁగలఁ డనుటకుఁ బరీక్షితుని కథయే దృష్టాంతము.

నాఁటినుండియే సప్తాహక్రతువు లాచరణలోనికి వచ్చెను. పరీక్షితునివలె మనమును వైరాగ్యమంది భక్తిశ్రద్ధలతో నీశ్వరుఁ బూజించి, పాడి, యాడి, ధ్యానించి, ముక్తులగుట కిది చక్కనిరాజ మార్గము.

అలంకరింపఁబడిన యొక మందిరమున శ్రీరామపటముఁగాని విగ్రహములుగాని యుంచి త్రికాలముల సహస్రనామపూజలు గావించుటయు, సర్వుల కన్నదాన మొనర్చుటయు, నహర్నిశాదులయం దెడతెగని రామభజనఁ జేయుటయు, వివిధపురాణకాలక్షేపములును, సప్తాహమునందుఁ జేయఁబడు ముఖ్యవిషయములు. నవగ్రహజపములు, హరికథలు, నుత్సవములు గూడ నీయజ్ఞకాలమున నొనర్తురు. ఇవి ప్రజల నాకర్షించుట కంగములుగ నేర్పరుపఁబడినవి.

రామదాసు కీర్తనలు, త్యాగయ్యగారి కృతులు, నారాయణ తీర్థులవారి తరంగములు కష్టతరమగు రాగతాళనిబంధనలతోఁ జెప్పఁబడియుండుటవలన సప్తాహమునకు వచ్చు ప్రతివ్యక్తియు భజనయందుఁ బాల్గొనుటకు వీలుగాకుండుటచే నామభజన మాచరణలోనికిఁ గొనిరాఁబడినది.

“గోవిందరామరామ గోపాలహరిహరి” యని పరమేశ్వరు నామగాన మొనర్ప నెల్లరకు సుసాధ్యంబు. ఒక మతమున నీ నామభజనమే శ్రేష్ఠమని యెన్నఁబడును.

ఒక స్వాములవారు మార్గమునఁ జనుచుండ నొకభక్తుఁడు “గోవిందంభజ గోవిందంభజ గోవిందంభజ మూఢమతే” యని శంక

రాచార్య భజగోవింద శ్లోకముల నతి శ్రావ్యముగఁ బాడుచుండఁ జూచి వాని భ_క్తి తత్పరతకు సంతసించి "'భజగోవింద' యనునంతలో 'గోవింద గోవింద' యని రెండుపర్యాయము లనవచ్చును. భజయని యుచ్చరించి కాలమును వృథసేయక శ్రీహరిదివ్యనామస్మరణఁ గావింపు" మని యుపదేశించిరి.

కనుక రాగతాళనిబంధనలకు లోనుగాని నామభజనము సులభమును, సర్వజనసాధ్యమును, విశేష ఫలప్రదమును నయియున్నది.

ఆ నామభజన కనువగు భజనకీర్తనల ననుబంధమునఁ జూడ నగును. (Appendix I)

మన దాసుగారు ముదిగల్లు, కళ్యాణదుర్గము, గంగవరము, సిర్పి, అనంతపురము మున్నగుచోట్లఁ బెక్కుసప్తాహము లాచరించిరి. బళ్ళారిమండలమునఁ గల అనకనహాలు, ఎరిడికేర యను గ్రామం బులందు సప్తాహములు గావించిరి. వీనినిగూర్చి పినాకినియం దిట్లు ప్రకటింపఁబడియెను.

పినాకిని:- ౧౯౨౮ సెప్టెంబరు ౬ తేది.

"అనంతపురం జిల్లాలో పలువురు బీదల కన్నదానము జరుగుటకు పెక్కు గ్రామముల నన్నసత్రములు స్థాపించి యందుకు సహాయముగా నుండుటకుఁ బెక్కు దేవాలయ ప్రతిష్ఠలు చేయించి ముదిగలు, గంగవరం, శిర్పి, పెనకలపాడు, వగైరా గ్రామాదులలో సప్తాహములు పదింటిని జరిపి, యనేక వేల బీదల కన్నదానము లీకష్టకాలంబునఁ గలిగించిన శ్రీ లింగరాజుగారు అనంతపురం గ్రామములో శ్రీరామ సప్తాహముఁ జేయుటకు, కొద్దిరోజులలో రాఁబోవుచున్నారని తెలిసినందుకు చాలా సంతోషముగా నున్నది." —

దీనింబట్టి యనంతపుర మండలమున వీరి సత్కార్యము లెంత విరివిగా సాగినవో తెలియనగును. ఇక వీరి కార్యములందు జరిగిన విశేషములఁ గొన్నిటినిఁ దెలిపెదను.

(1) ముదిగల్లునందు శివాలయోద్ధరణ మొనర్చినపిదప శ్రీరామ సప్తాహము జరుపువిషయమున నీశ్వరునకు లక్షబిల్వార్చనఁ గావించుచుండ నొకనవనాగరకుఁడు "రాతియం దేమికల"దని యాక్షేపించెను.

దానిపై "ఇందుగలఁ డందు లేఁ డని సందేహము వలదు చక్రి సర్వోపగతుం డెందెందు వెదకిచూచిన నందందే కలఁడు దానవాగ్రణి వింటే" యను ప్రహ్లాదవాక్యములు జ్ఞప్తికి రాగా, భగవంతుఁ డున్నది లేనిది తాఁ జూచెద నని మూఁడుమల్లికాసుమంబు లందుకొని, "సృష్టిస్థితిలయకారణుఁడును, ఆదిమధ్యాంతరహితుఁడును నగు భగవంతుఁడు బ్రహ్మమొదలు పరమాణువువఱకుఁగల సమస్తచరాచరప్రపంచమునం దిమిడియుండుట నిక్కమేని యిట్టిదేవాలయోద్ధరణాదిసత్కార్యము లీతనికిఁ బ్రియమేని నాసర్వాత్మకుని తేజ మీలింగమం దిసుమంతయైనఁ గలదేని నీ పుష్ప మిట్లే గాలియందుఁ దేలి నిలుచుఁ గాక" యని యొకపుష్పమును విసర్జించెను. భగవదాస్తిక్యపరీక్ష సఫలమయ్యెను. ప్రజలహర్షధ్వానములు మిన్నుముట్టెను. వారము దినములవఱకు పుష్ప మట్లే వాడక గాలియందు నిలిచియుండెను. ఈ విషయమై పెద్దాపురమున వీరిపై రచించిన భక్తవిజయధ్వజమున నిట్లు వర్ణింపఁబడినది.

"చం॥ ముదగలులోన మూఢజనముల్ మిముఁ గైతవదాసుఁ డంచు స
మ్మదమునఁ దూలనాడ జనమాంద్యము వాపగఁ జూడు డంచు స
మ్ముదమున లింగమూర్ధమున బుష్పము వేయగ నద్ది గాలిలో
బదిలముగాగ నిల్చె నొకవారము మీదగుశక్తిఁ జాటదే."

## (2) కళ్యాణదుర్గ సప్తాహము.

ఇచ్చట వీరొక సప్తాహము సంకల్పింప వేనవేలు ప్రజ లత్యుత్సాహమున 21 రోజులవఱకు సలిపిరి. మొదటిదినములలో నొక శ్రీమంతుఁడు సప్తాహము జరుగరా దని పట్టుఁబట్టి విఘ్న మొనర్పఁ బలువిధముల యత్నించినను రామకార్యముజరిగిపోవుచునే యుండెను.

ఒకరోజు భోజనసమయమున దాసుగారు రాపోశన వడ్డింతు మని వచ్చి "ఈ యాపోశనోదకము నమృతతుల్యముగాఁ గైకొనుఁడు. ఈ జల మెవ్వరిచేతినుండి యెన్నిబిందువులు క్రిందఁబడునో యన్ని పదిసంవత్సరములు బీదవై యన్నవస్త్రములు లేక బాధ నొందు నని నాకుఁ దోఁచుచున్నది. కాన భద్రముగఁ గైకొనుఁ" డని పార్థించి యాపోశన వడ్డించుచుండిరి. అందున్న శ్రీమంతుఁడు మితముదప్పి యాక్షేపించి యాపోశనోదకము క్రిందఁ బోయగా దాసుగారు కోపించి "సమస్తప్రపంచమును సృష్టించి, పోషించి సంహరించఁగల సమర్థుఁడు సర్వహృదయాంతరాళసంచారుఁడు, దేవాలయమందలి విగ్రహమునందు దనకళ నిల్పుట సత్యమేని యిరువదినాలుగు గంటలలో నీబ్రాహ్మణుఁడు పాపఫల మనుభవించు"నని పలికి చనిరి. భోజనానంతర మెల్లరు తాంబూలము సేవించుచుండ నధిక్షేపించిన శ్రీమంతుఁ డాతురమున వచ్చి "పుత్రభిక్షపెట్టు"మని దాసుగారి పాదములపైఁ బడిరి. దయార్ద్రహృదయులగు దాసుగారు శ్రీమంతుని దుఃఖకారణ మరసి తగురీతి నోదార్చి "మీకుమారునకు భయములేదు. భగవంతు ననుగ్రహమున కలరా నెమ్మదించును. ఈ రామప్రసాద మతని కిచ్చి యిచ్చుటకుఁ గోనిరం"డని పూజకుంకుమ నొసంగిరి.

అతఁ డాప్రసాదముఁ గొంపోయి రాత్రికి నెమ్మదించిన కుమారుం గొనివచ్చెను. కాని యాశ్రీమంతుఁడు కలరావలన మరణించెను. ఇయ్యది శ్రీదాసుగారి మాహాత్మ్యప్రకటనమునకుగాక భగవద్విశ్వాసమును దెలుపుటకే యిందు వ్రాసితిమి.

దాసుగారు కోపస్వభావు లని యిందుమూలమున తెలియును. మఱికొంద ఱాక్షేపించుటయుఁ గలదు. ధర్మహాని కలుగునప్పుడు క్రోధము నుపయోగించియే తీరవలయును. రామకృష్ణపరమహంసయు నీవిషయమునే వ్రాసియున్నారు. మహాత్కార్యములు జరుగునపు డీరీతియభ్యంతరముల సహించుచుండిన ప్రతివా రట్లే యారంభింతురు. దాసం గార్యభంగము కలుగును. కాన నట్టి క్రోధ

మవసర మనియే చెప్పక తప్పదు. వీరికోపము తాటియాకులమంట వలె గప్పున నారిపోవును. మహర్షులు సైతము కొలఁదిపాటి నేరములకు గొప్పగొప్ప శాపము లిచ్చుటఁగాంచియున్నాము. సమాధియందుండి భగవంతు నారాధించు నిందద్యుమ్నుఁడు తనరాక నెఱుంగమి లేవకునికి నది యవజ్ఞఁగాఁ దలంచి యగస్త్యుఁడుగజయోనిం బుట్టుమని శాపమిచ్చెను. ఇట్టి వనేకము చూపవచ్చును. విష్ణుద్వారపాలుర స్వధర్మమును నిర్వహించినందుకు సనక సనందనాదు 'లసురయోనిం బుట్టుఁ'డని శపించిరి. ఏలనట్లు చేసిరి? వారిని క్షమించిన తాముగావించు ధర్మాచరణమునకు బలువురు కంటకములుగా పరిణమింతు రని గదా! కాన నట్టికోపము దూష్యము కాదు.

## (3) నూతిమడుగు - హనుమంతాలయ నిర్మాణము.

ఈ గ్రామమునఁ బూర్వ మెవ్వరిచేతనో ప్రతిష్ఠింపఁబడిన యొక గొప్ప యాంజనేయవిగ్రహము నాగజెముడుకంపమధ్య నాలయము లేకుండ నుండ దాసుగారు గాంచి, విగ్రహదివ్యసౌందర్యమునకు మెచ్చి యచ్చట నొకయాలయముఁ గట్టింప సంకల్పించిరి. వెంటనే గ్రామములోని పిన్నపెద్దలను బిలిపించి విషయము ముచ్చటింపఁ జాల మంది విముఖతఁ జూపిరి. అంతటితో దాసుగా రూరకుండక రెట్టించిన యుత్సాహముతో స్వయముగా నొక గోనె సంచి తీసికొని మొదటి రో జొకబస్తా జొన్నలు సంపాదించి పని ప్రారంభించిరి. కార్య దక్షత గలవా రగుటచే నిల్లె బిచ్చమెత్తియుఁ దమ స్వంతధనము వెచ్చించియుఁ గొంతపని ముగించిరి. అంతట గ్రామస్థులు నిర్మాణ కార్యమునకు దీక్షతోఁ గడంగి ధనమును పుష్కలముగా చందా రూపమునఁ గూర్చి వెచ్చించి పూర్తిచేసిరి. ఆ యాలయమున హనుమంతుని దాసుగారు బ్రతిష్ఠించి యుత్సవముఁ గావించిరి. 5-6 సంవత్సరములుగ వర్షాభావమున జలాశయము లన్నియు నిర్జీవనములై యుండెను. ఆంజనేయప్రతిష్ఠ యైనవెంటనే కుంభవర్షము కురిసి చెరువులన్నియు నిండెను.

ఇప్పు డాదేవాలయము 50 వేల రూప్యముల విలువగల యాస్తి కలిగి ప్రతివత్సరము బ్రహ్మోత్సవములు జరుపఁబడుచున్నవి.

శ్రీరాం ఎఱ్ఱప్పనాయుడుగారు తమభార్య మరణించి నప్పటి నుండియుఁ దమసర్వస్వమును దేవాలయమున కర్పించి యందే వసించుచుఁ బుష్పోద్యానము, అన్నసత్రము, కోనేరు నిర్మించి యున్నారు.

ఇట్లే దాసుగారు తిరిగిన ప్రతిగ్రామమునం దేదో యొక సత్కార్యమును గావించుచునే యుండువారు. అనంతపురమండలమున వీరు గావించిన ఘనకార్యము లనేకములు గలవు. కాని గ్రంథవిస్తరభీతిచే నిందు వ్రాయ మానితిమి.

---

## ౧౦. గోదావరిజిల్లాయందలి సత్కార్యములు

(1) దాసుగా రిట్లనేక సత్కార్యము లాచరించి యారోగ్యము చెడి విశ్రాంతికొఱకు సెలవుపెట్టి తమ యత్తగారింటి కరుదెంచిరి. మార్గమున కృష్ణరావను వారికుమారుఁడు గతించెను. అచ్చటనుండి తమ మఱఁదలి యత్తగారూరైన రాజానగరమునకుఁ జనిరి. వీరి తోడి యల్లుఁడు సుబ్బారావుగా రా గ్రామమునఁ బాఠశాలోపాధ్యాయులు గానుండిరి. ఒకనాఁడు వీ రొక కమ్మరినిఁ జూచి వాని భూతభవిష్య ద్వృత్తాంతము లెఱిఁగింప నతఁడు వీరిశక్తిని వెల్లడించెను. అప్పటి నుండి యింటిచుట్టు జనులు గుంపులుగ మూగి తమ భావి ఫలములఁ దెలుపుఁడని బాధించుచుండిరి. అందఱితోఁబాటు వీరి తోడి యల్లుఁడు తమభవిష్యదర్థము లడుగ నొక సంవత్సరములోగా మరణింతువని చెప్పిరి. అందుకుదుఃఖించుచున్న తమయత్తగారిని మీకుమా త్రైయు (తమభార్య) నాల్గు సంవత్సరములలో మరణించును. ఇంత మాత్రమునకే దుఃఖింప నేల యని యూరడించిరి. ఈ రెండు విషయము లట్లే జరిగెను. రాజానగరము చిన్నగ్రామమైనను మిగుల వైభవమున నొక శ్రీరామసప్తాహము జరిగెను.

(2) అచ్చట సప్తాహము పూర్తియై యవభృధస్నాన మైనంతనే జగ్గంపేటకువచ్చి సప్తాహప్రారంభము గావించిరి. ఒకటిరెండురోజులు జరిగినంతఁ బూజయం దుంచఁబడిన రామపట్టాభిషేకపటమును జూచినవారు భయపడి మూర్ఛిలసాగిరి. దానికి వీరి కేమియుఁదోపక నొక తెఱ నడ్డుగాఁగట్టించిరి. ఒకజమీందారుఁ డీ వింతవిని పరీక్షింపవలయు నని వచ్చి దాసుగారితో "మీ రాముని౯ జూచి ప్రజలు మూర్ఛిలుచున్నా రఁట. మీ రేమయిన౯ బ్రయోగముఁ గావించియుండిన నుపసంహరింపుఁ"డన, దాసుగారు "నాకుఁబ్రయోగములుగాని, మంత్రతంత్రములుగాని తెలియవు. నేను దేశము నాస్తికతఁ జెంది పాపపంకిలము గాకుండ మతముపై దేవునిపై భక్తిఁ గలిగింప నాకాంక్షింతును. భగవన్నామభజన సలిపి నేఁదరించి నాతోడివారలఁ దరింపఁజేయఁ బ్రయత్నింతును. దానధర్మములు సన్నగిల్లుటచేఁ దిరిగి దేశమున దానధర్మములు బ్రతిష్ఠింప రాము నర్థింతును ఈ నా కోరికలకు మంత్రతంత్రము లవసరముండవు. భగవదిచ్ఛానుసారముగ సప్తాహము జరుగఁగలదు. నే నాకాంక్షించునది రామనామము, అన్నదానము" అని ప్రత్యుత్తర మిచ్చిరి. పిమ్మట జమీందారు తమ గుమాస్తాను రాముని దర్శింపఁ బంప నాతఁడు భయారావముతో మూర్ఛిల్లెను. ఆయన వెంటనే మూర్ఛనున్న లేఖరిని మోటారుపై వేసికొని వెడలి పోయిరి. సప్తాహ మద్వితీయవైభవమున ముగిసెను. ఆఱవరోజునఁ బూజ ముగిసి భోజనములైన పిమ్మట రాత్రి 9 గంటలవేళ పూజలో నుంచఁబడిన రామపటము పెటపెటారావంబునఁ బగిలెను. ఈ విషయమై భక్తవిజయధ్వజమున నిట్లు వర్ణింపఁబడినది.

"జగ్గమపేటలోన నల సంకులకీలఁ బటాన జూపి పెళ్
భగ్గున మండఁజేసి జనపాళికి నీదగు శక్తిఁ జూపినా
వొగ్గిక నాఁటనుండి నిను నుత్తమభక్తుఁ డటంచు సేవ హా
రగ్గలమౌనటుల్ సలుపరా? నినుఁ బోలెడు భక్తు లుందురే?

దీపము మండపమున కలం కరించిన కాగితముల కంటుకొని మండఁజొచ్చెను. ఇంతలో దాసుగారు 'ఓంశాంతిః" యని పలుకుచు

నీశ్వరధ్యాన మొనర్చుచు నతివిశ్వాసంబునఁ గొంతకుంకుమఁ జల్లి నంతనే మంటలారిపోయెను. మండపమున దాసుగారి పట్టుపంచెయు, రామాయణపారాయణఁజేయు బ్రాహ్మణుని పట్టుపంచెయు, రామాయణగ్రంథము నుండెను. అందులో బ్రాహ్మణుని పట్టుబట్టయు, రామాయణమునందలి కొన్ని పత్రములును తగులఁబడెను. ఆతగులఁబడిన కాగితముల నా బ్రాహ్మణుఁడు 'నాఁడు ప్రాలుమాలి చదువమాని తదనంతర కథ ముగించితి' నని తెలిపిరి. ఇక్కడ పూర్ణాహుతి ముగియగనే పెద్దాపురమున కరుదెంచి సప్తాహమున కుపక్రమించిరి.

(3) పెద్దాపురమున ముం దెన్నఁడును మంచికార్యములు జరుగకుండుటచే దాని కెవరో పంచమహాపాతకపట్టణ మని పేరిడిరఁట. ఇచ్చటఁ జరిగిన సప్తాహవైభవము మున్నగు సకలవిషయములును సప్తాహానంతర మీ గ్రామపత్రికలచేఁ బ్రచురింపఁబడిన భక్తవిజయధ్వజ మను చిన్నిపొత్తమునందు విపులముగ వర్ణింపఁబడి యుండుటచే నా పద్యముల నిందు వ్రాయుచున్నాము.

సీ॥ శ్రీరాము దివ్యాజ్ఞ శిరమున ధరియించి
పొంగి సద్వంశ భూషణుండు
లింగమూర్త్యాఖ్య వెలింగెడు సద్భక్తుఁ
డీ బృహత్పురమున కేగుదెంచి
రామసప్తాహసంరంభుఁడై కొందఱి
పురజనాధికులతో ముచ్చటింప
నీయూర నెఱవేర దిట్టిది యనువారు
ధనవంతు లిందు లే రనెడువారు

గీ॥ నగుచుఁ బౌరులు విముఖులై యరుగ నంత
విప్రుఁ డుడుగక శ్రీరామవిభునియాజ్ఞ
నెట్లు నెఱవేరకుండు నం చెంచి కడిమిఁ
దాన సమకట్టెఁ గార్యసంధానమునకు. 1

సీ॥ కన్యకాంబాదేవి ఘనతరాలయమున
శ్రీరామవిభుని సంస్థితునిఁ జేసి
ప్రథమదినంబునఁ బాఱుండు నిజసతీ
సుతయుక్తి నత్యంతశుద్ధమతిని
హరిభజనారంభ మమరింప నొక్కొక్క
పౌరుండు రాముని ప్రేరణమున
వెసవచ్చి సప్తాహవిధమును గని మెచ్చి
యుల్లముల్ భక్తిచేఁ బల్లవింప
గీ॥ భజనకై కొందఱును బాకపచనముఖ్య
సేవలకుఁ గొందఱును జేరి చెలఁగి మెలఁగఁ
గొంద ఱర్థ్యపదార్థముల్ గొంచు వచ్చి
యలరి సప్తాహనిర్వాహు లగుచు నుండ్రి. 2

మ॥ మఱునాఁ డర్థపదార్థయుక్తి రఘురామప్రేరితస్వాంతులై
పురుషుల్ గుంపులుగూడి వచ్చి నతులై మోదంబునన్ జానకీ
వరు "రక్షా మము దేహి" యంచు విలసద్భక్తిప్రహర్షంబునన్
గరతాళంబులఁ దట్టుచున్ గడఁగి రేకగ్రీవులై పాడఁగన్. 3

ఉ॥ మూఁడవనాఁడు కాంతలును బూరుషులు న్వెసవచ్చి మాటిమా
టాడక రామదేవుచరణాబ్జముల న్గని సాగి మ్రొక్కుచున్
మాడలు రూకలున్ బహుసమంజసవస్తుచయుం బొసంగుచున్
పీడిన సంశయంబుల నభేదగతిన్ భజియించి రిమ్ములన్. 4

సీ॥ ఆవల ననుదిన మంతయిం తనరాని
ప్రబలమౌ భక్తిచేఁ బౌరులెల్ల
నాబాలగోపాల మరుదెంచి సప్తాహ
సన్నాహమందు నుత్సాహు లగుచు
దేహగేహములపై నూహ సుంతయు లేక
స్త్రీ పురుషులు గూడి రేఁ బగల్లు
సతము సీతారామశబ్దసంస్మరణంబు
దవిలి సేయుచుఁ బాడ దద్రినంబు

గీ॥ పుడమి నిండి దిగంతముల్ భోరుకొల్పి
త్రిదివ మంటి సురారికిఁ దెలిపి యంత
జనక, యజుకర్ణరంధ్రముల్ సయ్యదూరి
వచ్చె ననఁగఁ బ్రతిధ్వను లిచ్చె నహహ. 5

సీ॥ సప్తాహసంబంధసంతర్పణంబునఁ
గోర్కె లారఁగ గూడుఁ గుడిచికుడిచి
కరతాళసంగతుల్ గణుతికెక్కెడిలీల
నచ్చంపు సద్భక్తి యాడియాడి
హరి! రామ! గోవింద! యని నోరు నొవ్వంగ
బహుసుగీతంబులఁ బాడిపాడి
భవమార్ప వేరొక్క పథము లేదంచు రా
మాఖ్యోజ్వలామృత మానియాని
గీ॥ ముందుకై దాచిపెట్టిన ముల్లెయంచు
సతులు బతులును సప్తాహసత్క్రియలకు
నేకమై కొంతఁగొంత ప్రత్యేకముగను
నర్పణము సేసి రర్థపదార్థములను. 6

సీ॥ ప్రతియింటి గోడపై వరుస సీతారామ
నామాక్షరంబులఁ బ్రేమ వ్రాసి
ప్రతిమానవునకు శ్రీరామప్రసాదంబుఁ
గుక్షి పావనముగఁ గుడువఁ బెట్టి
ప్రతివానిచే రఘుప్రవరుని గీతముల్
వాక్శుద్ధికై లెస్సఁ బాడఁ జేసి
ప్రతిపురవాసిని స్వాంతాబ్జమందున
శ్రీలోలుపదభక్తి స్థిరతనాటి
గీ॥ రామనామమహాత్వ మేర్పడఁగఁ దెలిపి
జనులఁ ద్రికరణశుద్ధులసలుపఁ బుడమిఁ
బుట్టి యేతెంచె నీలింగమూర్తి యితఁడు
పోల్పఁ గేవల మాలింగమూర్తికిఁ గాఁడె? 7

సీ॥ భక్తిరసావేశపరవశస్వాంతులై
దాశరథినిఁ బాడు దాసవరులు
క్రీడాభిరతి వీడి శ్రీరాముఁ బాడుచు
బహువిధంబుల నాడు బాలకులును
ఘనజటాయుక్తిఁ జక్కఁగ వేదమంత్రముల్
పఠనంబుఁ గావించు బ్రాహ్మణులును
రామాయణాదిపురాణకాలక్షేప
పరులౌచుఁ దనరారు పండితులును
గీ॥ గలిగి సప్తాహసన్నాహఘనవిభవము
శ్రోత్రనేత్రంబులకు లెస్స శుద్ధిఁ జేసి
స్వాంతములఁ జొచ్చి విషయసంపర్క మడఁచి
ధన్యులను జేసెఁ బౌరసంతతుల నార. 8

సీ॥ భావశుద్ధిగ 'న దైవం కేశవాత్పర'
మని యెంచి హర్షించు నార్యవరులు
భక్తహృద్ధాముఁ డౌ భానుకులుం డిందు
నక్షిగోచరుఁ డయ్యె నను సుజనులు
మేము మే మని రఘురాముసేవలఁ జేయ
ముందంజవేయు స్త్రీపురుషవరులు
సుకృతసంగ్రహణకు సొబగైనతఱి దీని
బోనీకుఁ డనెడు సద్బుద్ధియుతులు
గీ॥ నిటుల శ్రీకృష్ణుఁ జేరగ నేగుదెంచు
గోపగోపీచయంబుల కొమరుఁ దీర్చి
పౌరులెల్ల మహోత్సాహపటిమఁ బేర్చి
రాము సేవింత్రు కలుషవిరాములగుచు. 9

క॥ సప్తాహకర్మదీక్ష స
మాప్తంబగు నవలిదిన మమందానంద
వ్యాప్తిన్ రాముఁడు త్రిజగ
త్ప్రాప్తికిఁ బట్టాభిషేకపదవిన్ గాంచెన్. 10

సీ॥ ఆ మహోత్సవము మహావైభవోన్నతి
నలరారె నధికశుభావహముగ
నిసుకఁ జల్లిన క్రింద నించుక బడకుండ
గాలికైనను సందు గలుగకుండ
ముల్లోకముల జను లుల్లముల్ భక్తిసం
ధిల్లి యీనగరి కేతెంచి రనఁగ
నరసమూహములు క్రిక్కిరిసి సేవింపంగ
వివిధమంగళవాద్యవితతి మ్రోగ

గీ॥ జానకీజాని పూజావిధాన మొప్పి
ధూపదీపాభిషేకార్చనోపహార
ముఖ్యవిధ్యుక్తసత్క్రియాపూర్వకముగఁ
బౌరజనముఖ్యపరిపాకఫల మనంగ. 11

గీ॥ రామనామామృతానందరససువృష్టి
ముసిరి సప్తదివారాత్రములును నొక్క-
సరణి గురిసి పురప్రజాసంఘహృదయ
తాపములఁ బాపెఁ దజ్జన్మతతి ఫలింప. 12

సీ॥ పట్టాభిషేకోత్సవపునాఁటి రాతిరి
వీధియూరేగింపు వెలసెఁ బురిని
మున్నెన్నఁడిట్టిది విన్నది కన్నది
లేదని రీనగరీజనములు
సర్వంబును నమానుషక్రియ నెఱవేరె
నరులయత్నము లిట్లు జరుగఁగలవె
జనములు సంఘోషసంఘంబులై రామ
నామకీర్తనము నొనర్చి రెసఁగి

గీ॥ యవని గోవింద-గోపాల-యనురవంబు
వెడలెఁ బ్రతిజిహ్వనుండి నివ్వెఱ జనింప
నప్రయత్నంబుగా నిది యరయ నిందఱ
జాలమో లింగమూర్తియుద్వేలమహిమొ. 13

సీ॥ పటహాంఢక్కాముఖ పటుఢంఢమధ్వనుల్
భేరికాభాంకృతుల్ భోరుకొల్ప
వేణుకాహాళరవవితతులు బ్ర్యాండుమ
హాధ్వను లొండొంటి నతిశయింప
తాషాలు మర్ఫాలు తటతట మ్రోగంగ
బాకాలు భీకరధ్వనులు సేయ
మృదుల మృదంగ ఢిమ్ఢిమి నినాదంబులు
వీణాక్వణంబులు విస్మయమంద
గీ॥ నొక్కమొగి సప్తకీరథు లుక్కుమిగిలి
భూమిముంపంగ వచ్చెడు పోల్కిదోప
బ్రహ్మాండ కటాహంబు పగిలె ననంగ
మిన్నుముట్టెం దదుత్సవోత్పన్నరవము. 14

క॥ ఇలు వెడలని కులకాంతలు
కలరేగి 'నమో నమో హృషీకేశ' యటం
చెలుగెత్తి పల్కుచును వీ
ధుల నడచిరి భక్తితమ మతుల నుప్పొంగన్. 15

ఉ॥ రాముని గర్భగోళమున రాజిలునట్టి జగచ్చయప్రజా
స్తోమము లీమహోత్సవముఁ జూడగఁ బైకరుదేరఁ బోలు లే
కీమహనీయసంఖ్యజను లీ పురికిం దుఱిటిలోన రాగలా
రే మఱి భక్తి యీగతి స్ఫురించునె యీపృథివీజనాళికిన్? 16

సీ॥ లక్షమారేడుదళములచే శంకరు
చరణాబ్జయుగపూజ నెరపె నియతి
లక్షసంఖ్యార్చనరాజిల గౌరికిఁ
గుంకుమచేఁ జేసె గుణసమృద్ధి
నంతఁబోక దశాననాంతకు నొకలక్ష
తులసీదళార్చన సలిపెఁ జెలఁగి
యవనిజ మఱిలక్షహాటకసుమముల
పాదార్చన మొనర్చెఁ బరమభక్తి

గీ॥ దుర్గతులఁ బాప యిటుల ననర్గళముగ
సలిపె నపవర్గమార్గంబు జనులకెల్ల
నితఁడు సామాన్యమనుజుఁడే యీశ్వరాజ్ఞ
భక్తి భువినాట మను మహావ్యక్తికాని. 17

గీ॥ భక్తి పుంభావ మొంది యీ వసుధఁ బుట్టి
లింగమూర్త్యాఖ్య నొంది వెలుంగఁబోలుఁ
బడసితిమొ యిట్టి పతితపావనుని మున్న
లలితగుణయుక్తుఁడైనఁ బ్రిహ్లాదునవల. 18

సీ॥ సిగరెట్లు చుట్టలం దగులఁబెట్టెడు వేళ
రామ తేజఃపుంజరమను గాంచు
చందన లేపంబు నొందుచుండెడు వేళ
రామ సత్త్వగుణానురక్తిఁ గాంచు
సోడాను కిల్లీని నీ సోకుచుండెడు వేళ
రామనామామృతప్రాప్తిఁ గాంచు
అత్తరుఁ బన్నీరు నందుచుండెడు వేళ
రాము మైతావులగోముఁ గాంచు

గీ॥ అంతియేకాని భామభోగానురక్తి
కాదు మీ రీరహస్యపరికార మెఱుఁగ
లేక యటుఁజేసి చెడకుఁడీ లోకులార!
పులినిఁగని నక్క వాతలు బూనినటుల. 19

సీ॥ ఈ వెఱ్ఱివాఁడయా! యెంతవాఁడో యని
తలఁచితి నని దూరు తులువయొకఁడు
తలనెఱయ న్లేదు దాసుఁ డెట్లా నీతఁ
డని తూలనాడెడు నజ్ఞుఁడొకఁడు
చురచుర సిగరెట్లు చుట్ట లీతఁడు గాల్చు
భక్తుఁ డెట్లానను బాపియొకఁడు
దాసునకు న్నాకు దారతమ్యం బెందు
గనలే దనుచు నాడు చెనటియొకఁడు

గీ॥ కలితకాషాయవస్త్రముల్ గట్టినంత
నెట్టివాఁడైన పూజ్యుఁడై యెసఁగు నందు
రదియుఁ గనజాల మీదాసునందు ననుచు
గోరి కొండంత పాపంబుఁ గొనిరి జనులు. 20

సీ॥ ఒకనాఁడు గంధంబు నోడలి నిండుగఁ బూయు
నోకనాఁడు భస్మంబు నోడలు నించు
నోకనాఁడు బరుపుపై నొయ్యనఁ బన్నుండు
నోకనాఁడు రాలపై నొరగుచుండు
నోకనాఁడు మృష్టాన్న మోలి భుజించును
నోకనాఁడు గంజి పానకమె యనును
నోకనాఁడు పుష్పమాలికలను ధరియించు
నోకనాఁడు రుద్రాక్ష లొనరఁదాల్చు
గీ॥ భోగవైరాగ్యముల రెంటిఁ బొత్తుఁగలిపి
కలియుగంబునఁ జరియించు నలిననాథు
నపరమూర్తియె నాగను నవనియందుఁ
జెంగలించెడుఁ బోణంగి లింగమూర్తి. 21

సీ॥ పిల్లికి బిచ్చంబుఁ బెట్టనేరని లోభి
వందలకొలఁది రూప్యమ్ము లొసఁగు
దేవుఁ డేడీ యను నాస్తికుఁడు సీపీఠమ్ము
దగ్గరి వేగ దండంబు వెట్టు
సంసారసుఖమె మోక్షమ్మను మూఢాత్ముఁ
డద్దానియందు మోహమ్ము వీడు
కొలఁదివైనను భక్తిఁగలిగిన పురుషుండు
పరతంత్రుఁడై రామభజనసలుపు
గీ॥ యంత్రిసామర్థ్యమొ తపోమహత్వమొక్కొ
తెలుపవశమానె మాకు నిష్కలుషహృదయ
అమలచారిత్ర రామభక్తాగ్రగణ్య
మంగళాకార పోణంగి లింగమూర్తి. 22

సీ॥ అధికారగౌరవమ్మంతయు వీడి సక్క
గణియించు నుద్యోగిగణము లొకటఁ
రామాయణమ్ము పారాయణ మొనరించు
వైదికాగ్రేసరవర్గ మొకట
నే యపేక్షనో కాని యెల్లవేళల నిన్ను
వదలకుండెడు న్యాయవాదు లొకట
తగుమాధభక్తి పైఁ దగిలి యెంతే రామ
భజనమ్ముఁ గావించు పౌరు లొకట

గీ॥ తన్మయత్వంబు నొందిన ధన్యు లొకట
వినతు లొనరించుఁ గామినీవితతి యొకటఁ
జేర రామసప్తాహమ్ముఁ జేసి తీవు
అంగనాజనవిముఖాంగ లింగమూర్తి. 23

సీ॥ జరిపించినావఁట సప్తాహములఁ జాల
వేశ్వరుస్థలముల వింతఁగొలుప
స్థాపించినావఁట తగుయంత్రముల విగ్ర
హమ్ములక్రింద దేవాలయముల
వెలయించినావఁట యలువెన సత్రమ్ము
లన్నదానముసేయ నెన్నోచోట్ల
రూపించినావఁట శ్రీపరమేశుమా
హాత్మ్య మెన్నెని దేవాలయముల

గీ॥ నడపినావఁట వివిధసంతర్పణముల
కలిపినావఁట మతభేదములకుఁ బొందు
చేసినావఁట పూజావిశేషములను
క్లేశరహితాత్మ! పోణంగి లింగమూర్తి. 24

—(భక్తివిజయధ్వజము.)

పై పద్యములందు వర్ణించిన తెఱఁగున సప్తాహమేగాక యీశ్వ
రునకు లక్షబిల్వార్చనయు, నవనిజకు లక్షసువర్ణసుమంబుల పూజయు,

శ్రీరామచంద్రునకు లక్షతులసిపూజయు, శ్రీ కన్యకాపరమేశ్వరికి నూత్నయంత్రస్థాపనము, లక్ష కుంకుమార్చనయు నీకార్యములయం దపూర్వమైన యన్నదానమును, బీదలకు వస్త్రదానమును మహావైభవమున జరిగెను.

సప్తాహ మొనర్ప లింగరాజుగారిగ్రామమునకు వచ్చినపుడు గ్రామమునంగల పెక్కురు ధనికులు పలుకుఁబడికలవారు నిరుత్సాహపఱచుటయేగాక యీ సత్కార్యము జరుగకుండుటకుఁ బ్రబల ప్రయత్నము చేసిరి. కాని భక్తపరాధీనుఁడగు శ్రీరాముఁడే యీకార్యమునకుఁ గర్తయు భర్తయునై నిర్విఘ్నముగా మహావైభవముగ జరిపి తన్ను నమ్మినవారి సత్సంకల్పములఁ దానె నెరవేర్తునని లోకమునకుఁ బ్రదర్శించెను.

ప్రజలనందఱిని సంతోషపఱచు మానవుఁడుగాని కార్యముగాని యుండుటకల్ల. తుదకుఁబరమేశ్వరుఁడైన నందఱిదృష్టినొందింపఁ జాలఁడన మానవు లన నెంత ? పైవిధమున మహావైభవముగ శ్లాఘాపాత్రముగ జరిగిన మహత్కార్యములఁగాంచి యసూయాపరుఁడగు నొకధనికుఁడు దాసుగారి స్వభావమును గార్యములను నాక్షేపించుచు నొకపెద్దకరపత్రము ముద్రించిరి. కేవలము వీరినేగాక వీరిపైభక్తవిజయధ్వజమును వ్రాసినవారిని విమర్శించి తమయసూయాభావమును బూర్తిగ వెలిబుచ్చుకొనిరి.

వీరి యాక్షేపణలకు భక్తవిజయధ్వజమునందలి 19, 21 పద్యములే జవాబిచ్చుచున్నవి. వీరికోపస్వభావమును గూర్చి కళ్యాణాదుర్గ సప్తాహ సందర్భమున వ్రాసియున్నాము.

(a) ఇఁక నాచారవిషయ మొక్కటి మిగిలియున్నది. (b) శ్రీ దాసుగారికి సామాన్యముగ భక్తు లనిపించుకొనువారికుండు బాహ్యాడంబరములు లేవని యొకయాక్షేపణ. (c) ఆత్మస్తుతి కలదనుట.

(a) "క్రమమున శిష్టాచారక్రమ మెఱుఁగక ధర్మమునకుఁ గడు వాటంబై విమలంబగు చిత్తము" అని యున్నది. చిత్తము విమలమై

మహాకార్య సంధాన మొనర్చువారి కాచారనియమము లేల? భగవద్గీతలో చెప్పినటుల లోకమున కాదర్శముగనున్నవాఁ డితరు లనుష్ఠించుటకైన ననుష్ఠించుట యవసరముకాని లేనంతమాత్రమున నష్ట ముండదు.

(b) "జగమెఱింగిన బ్రాహ్మణునకు జందెమేల? యన్నట్లు వాస్తవమైన భక్తునకు బాహ్యవేషము లేల? శ్రీదాసుగారు లోకుల మెప్పునకుఁ బేరుప్రతిష్ఠలకుఁ గాక భక్తులగుటచేఁ దమ స్వధర్మము నిర్వర్తించుచుండిరి." భక్తికి గమ్యస్థానము భక్తియే. అట్లగుటచే బాహ్యవేషములయక్కఱ లేకుండుటయేగాక యొక్కొకతఱి యవి బాధాకరము లగుటకూడ కలదు. వీరు మొదటినుండి మానసికపూజ కభ్యాసపడి యున్నవారు. నిష్పక్షపాతబుద్ధితోఁ జూచిన నివి యొక దోషములుగా నెన్నఁబడఁగూడదు.

(c) ఆత్మస్తుతి కలదనుట.—వారు తాము గావించిన పనులను సందర్భానుసారముగ వర్ణించి శ్రోతల నుద్రేకులఁ గావించి సత్కార్యానుష్ఠానతత్పరులం జేయుదురుగాని యితరులఁ దృణీకరించి తమ స్తుతినిఁ జెప్పుకొను టెక్కడను లేదు. తమ్మెంతగా విమర్శించినవారిని గూర్చి యతి సుహృద్భావమున వారు నాకుఁ జాలమేలు చేసినవారని పల్కుచుందురు.

కాన వారు తాముచేసిన పనులఁజెప్పి యితరుల నట్టి సత్కార్యాచరణమున కుద్బోధించుట యాత్మస్తుతి కానేరదు. ఇంతటితో నసూయాపరుల విమర్శనల విడి కథ ననుసరింతము.

(4) కాకినాడ సప్తాహము:— పెద్దాపుర సప్తాహావభృథస్నానానంతరము కాకినాడయందు సప్తాహాంకురార్పణఁ గావించిరి. ఆ సప్తాహము మిగుల వైభవముగా జరిగెను.

ఇంతలో దాసుగారికి సెలవయిపోవుటచే గిద్దలూరు సబ్ మాజస్ట్రేటుకోర్టులో హెడ్ గుమాస్తాగాఁ బ్రవేశించిరి. ఇచ్చట వీరొక సప్తాహము గావించిరి. తలవనితలంపుగఁ బ్రారంభింపఁబడి యతివైభవ

ముగ జరుగుటఁ గాంచి ప్రజలత్యాశ్చర్యమునకు లోనై యిట్టి వైభవమున జరిగిన యాగమును ధా మెన్నఁడు దత్తమండలమునఁ జూడలేదని చెప్పసాగిరి.

---

## ౧౧. బిక్కవోలు సప్తాహము

కాలమహిమ దురూహ్యము. పూర్వ మొకప్పుడు బిరుదాంకపుర మని పేరు మోసిన పెద్దపట్టణ మిప్పుడు సాధారణపల్లెగా మారి బిక్కవోలని పిలువఁబడుచున్నది. ఇది తూర్పుగోదావరిజిల్లా రామచంద్రపురము తాలూకాలో నున్నది. అనేక పురాతన దేవాలయములు శిథిలములై యచ్చటచ్చట వరిపొలములమధ్య యగుపడుచుండును. ఒక్క శివాలయము మాత్రము కాలప్రవాహమునఁబోక పూజలొందుచున్నది. ఇందుఁగల లింగము కామధేనువుచేఁ బ్రతిష్ఠింపఁబడుటచే గోలింగేశ్వరుఁ డని పిలువఁబడుచున్నది.

ఈ యాలయమునఁ గల సుబ్బరాయఁడు స్వామికి నేటేట మార్గశిరశుద్ధ షష్ఠి మొదలు బ్రహ్మోత్సవ మతివైభవముగ జరుగును. బ్రహ్మోత్సవమున హరికథలు పాటకచ్చేరీలు నాటకములు జరుపుట యనాదిగా వచ్చు నాచారమగుట 1928 వ సంవత్సరమున జరిగిన బ్రహ్మోత్సవమున హరికథాకాలక్షేపముసేయ కూచిమంచి మూర్తి రాజుగారు విచ్చేసి రామదాసు చరితము నతిభక్తియుక్తముగ, కర్ణపేయముగఁ జెప్పి పురజనులను భక్తి నోలలాడించి బ్రహ్మోత్సవమునకు వేయఁబడిన పందిళ్లు పాకలు విప్పకయును పే తమచే నొక సప్తాహము చేయించవలసిన దనియు దానికగు వ్యయ మత్యల్పమనియు నుడివి పురప్రముఖుల నియ్యకొనఁజేసిరి. ఆగ్రామమున 1925 నుండి డాక్టరుద్యోగమున నున్న నేనును (గంగరాజు వెంకటామయ్య) సత్కార్యమున కియ్యకొని నాచే నగు నల్పసహాయముఁ జేతు నని మనవి జేసి యచ్చట పలుకుఁబడిగల పెద్దలతో యోచించి వారి యంగీకారమును సహాయమును బడసితిని.

అంతట ప్రజ లత్యుత్సాహంబున 5000 రూప్యంబులు భూరి విరాళమొసంగి సప్తాహమునకు సకలపదార్థములను సమకూర్చిరి. ఈ సమయమున మాతండ్రిగారు స్వర్గస్థులగుటచే మా స్వస్థలమగు గుంటూరుజిల్లాకు వెళ్ళవలసి వచ్చెను. పండితులును, జ్ఞానులును, సంపన్నగృహస్థులును, పెక్కు సత్కార్యములయందు యాజమాన్య మువహించి నిర్వహించిన యనుభవజ్ఞులును నా మిత్రులు ను నగు నా గ్రామకరణము తక్కెళ్ళపాటి వీరాజు పంతులుగారిని సప్తాహయత్న ములు సాగింపవలసినదిగఁ గోరి నేను మా గ్రామమునకు వెళ్లితిని. సప్తాహము నేను తిరిగి వచ్చినపిమ్మట జరుపు నేర్పాటు చేయఁబడెను.

అసూయాపరులు కొందఱు కుతంత్రములు పన్ని సప్తాహము విఘ్నమొనర్ప నూహించి బ్రాహ్మణాబ్రాహ్మణసమస్యక్రింద నీ దైవకార్యమగు సప్తాహమును మార్చి గ్రామమునఁ గలఁతఁ బుట్టించిరి. సప్తాహము నిర్విఘ్నముగఁ బరిసమాప్తి నొందఁగోరు కరణముగా రప్పు డాగ్రామమున మాధ్యమిక పాఠశాలా సహాయోపాధ్యాయులును (శ్రీ) దాసుగారి సప్తాహములను గన్నులారఁ జూచి యానందించినవారును దాసుగారిశక్తి నెఱింగినవారునునగు ఆకెళ్ల వ్యాఘ్రప్పగారి ప్రోత్సాహమున గిద్దలూరునం దుద్యోగమునను్న దాసుగారికి వెంటనే వచ్చి సప్తాహయాజమాన్యమును వహించి నెఱ వేర్చవలసినదిగాఁ బ్రార్థించుచు నొకతంతివార్త నంపిరి.

వీరును దానిని రామాజ్ఞగా భావించి వెంటనే బయలుదేరి బిక్కవోలుఁ జేరిరి.

వీరు వచ్చినంతనే గ్రామము మారుమ్రోగ రెడ్డినాయకులు పలువురు వీరిని దర్శించి గ్రామకలఁతకుఁ గారణమగు సమస్యను జెప్పి పెక్కు ప్రశ్న లడిగిరి. దాసుగారు తాము రామాజ్ఞను బొందివచ్చుటకు వచ్చితిమనియు, మరునాఁ డుదయమున సప్తాహమును బ్రారంభింతు మనియు, శ్రీరాముఁడే దీనికి నాధుఁడై నడిపించుననియుఁ జెప్పగా కరణముగారు రత్యాశ్చర్య మందిరి. తమకు సాధ్యమగునంత వఱకు దాసుగారిని సప్తాహసంకల్పమునుండి విరమింపఁ జేయ యత్నించి

విఫలులైరి. గ్రామ పరిస్థితులన్నియు విపులముగ నుడివిరి. బ్రాహ్మణేతరసహాయ మపేక్షించిన లాభముండదనియు, బ్రాహ్మణులిదివఱకే శక్త్యానుసారము మేము తలపెట్టిన సప్తాహమునకు విరాళ మొసఁగుటచే తిరిగి వీరి సప్తాహమున కియ్యఁజాలరనియుఁ బ్రోవైన ధనమును దమయొద్ద లేదనియు సెలవుపై వెళ్ళిన నేను తిరిగివచ్చుఁ దనుకనైన నాగిన బాగుండు ననియు కరణముగారు ప్రార్థించిరి. లాభము లేక పోయెను.

మరునాఁ డుదయముననే కొలఁదిమంది జనులతో వీరు గోదావరి కాల్వయందు స్నానమాడి వీధుల వెంట భజనఁజేయుచు, గోలింగేశ్వరాలయముఁ బ్రవేశించి పూజారి నడిగి రామపట్టాభిషేక పటమును, కొంత నూనె యక్షతలుఁ దెప్పించి సప్తాహకార్యమున కుపక్రమించిరి. కలహాభోజను లగు నాయకులు తమవిఘ్నప్రయత్నముల సాగించుచునే యుండిరి. మొదటి రెండురోజులు సప్తాహము చప్పగానుండెను. కరణముగారు వీరికి సప్తాహమువూని వెంటనే గిద్దలూరుకు వెళ్లిన సరసముగా నుండు నని వర్తమాన మంపిరి. "సర్వము రాముఁడే నిర్వహించు" నను మనకథానాయకుఁడు గ్రామ స్థులవిముఖతకుఁగాని, కరణముగారినిరుత్సాహమునకుఁగాని భయపడక తమపనియందే మునిఁగియుండిరి. ప్రత్యర్థిప్రజలలో నొకరికి రాత్రియంతయుఁ బెద్దపెద్ద కోతులు గనుపించి పంట్లు గికురించి భయభ్రాంతులఁ గావించుటచేఁ దెల్లవారువఱకే తమతోటలోనున్న కూరగాయలు సప్తాహమునకుఁబంపి తమవిరుద్ధాభిప్రాయమును మార్చుకొనిరి. మూఁడవరోజు నుండియు, జనశూన్యముగ నుండిన దేవాలయముగుంపులతో నిండిపోయెను. భజన కలదా లేదా యని సందియము గొలుపు సప్తాహమండపము ప్రజల భజనకోలాహలముతో నిండిపోయెను. పెక్కు వేల బీదల కన్నదానము జరిగెను. విముఖతఁజూపిన రెడ్డి నాయకులందఱు శ్రీదాసుగారికి దాసులై ద్రాతింబగళ్లు వీరిని వెంట నంటియుండెడివారు. పూర్ణాహుతి మిక్కిలి వైభవముగ జరుపఁబడెను. నాఁటిరాత్రియే వీరు గిద్దలూరు వెళ్లుటకుఁ బ్రయాణముసేయ గ్రామ

జను లందఱును వీరిని రెండుమైళ్ళ దూరమున నున్న రైలుస్టేషను నొద్దకు భజనతోఁ గొంపోయి రైలులో వీరి నెక్కింపకయే భుజముల మీఁద నెక్కించుకొని స్టేషనులో నాడిరి. అర్థగంటవఱకు రైలాగ వలసివచ్చెను.

ఈ మహనీయుని ప్రథమదర్శన భాగ్యము నాకు బిక్కవోలు సప్తాహమునం దబ్బినది. నాఁటినుండియె వీరియెడఁ బూజ్యభావ మేర్పడి క్రమక్రమముగా గురుభక్తిగాఁ బరిణమించెను. వీరును నన్నత్యాదరమునఁ జేరఁదీసి తమ ప్రథమ శిష్యునిగ గ్రహించి మంత్రోపదేశ మనుగ్రహించిరి.

వీరి సప్తాహపూర్ణాహుతి ముగియుటతోడనే మేము తలపెట్టిన సప్తాహ మారంభింపఁబడి వైభవముగా నేకలతలు లేకుండ రెడ్డి ప్రముఖులందఱు నడుములు గట్టుకొని కార్యమువహింప భూరియున్న దానముతోఁ జరుపఁబడినది.

"చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మవిభాగశః."

సత్త్వాదిగుణములు కర్మలు వీని ననుసరించి నేను నాలుగు వర్ణములు సృజించితి నని పరమాత్మ వచించెను.

తొలుదొల్త మానవునికిఁగల గుణములనుబట్టియు, యాతఁడాచరించు కర్మలనుబట్టియు వర్ణనిర్ణయము గావింపఁబడె ననుట పై శ్లోకమువలన స్పష్టము.

రానురాను కాలమాహాత్మ్యమున నీ వర్ణనిర్ణయము పుట్టుకవల్లనే స్థిరపరుపఁబడనయ్యెను. దాన నగ్రవర్ణములవారియెడ తక్కువ కులజులకు నసూయ యేర్పడుట సహజము. వేదము, వేదాంతము మొదలగు సమస్త ధర్మప్రామాణిక గ్రంథములు బ్రాహ్మణాధీనములై వారి కుపయుక్తమగు తెఱఁగు నన్వయింపఁబడి పురాణములుగ తక్కువ వర్ణములవారికిఁ బ్రసాదింపఁబడెను. వీనియందు బ్రాహ్మణాధిక్యత ప్రతిపాదింపఁబడెను. గుణకర్మలు సాత్త్వికములు గాకయున్నను జన్మవల్లఁగలిగిన బ్రాహ్మణత్వమును దక్కువజాతివారు గౌరవింప

లేకుండిరి. దీన జాతివైరములు బయలుదేరి మతమునకేగాక దేశము నకుగూడ ముప్పుదెచ్చినవి. వైషమ్యమునకు లోనై యొండొరుల యందుఁ గల మానవత్వమును హింసించికొని సప్తాహము మొదలగు దైవకార్యములయందును గలతలు పెంచుకొని భారతీయులు భక్తి శూన్యులై మతాధిక్యము గ్రహింపక యహూయాగ్రస్తులై దేశ మాతకు క్షోభఁ గలిగించు చున్నారు.

ఇట్టి వైషమ్యములు లింగరాజుగారివంటి దైవభక్తులవల్ల, మహాత్మగాంధిగారివంటి దేశభక్తులవల్ల దీర్పనెంచి వారిని దైవము సృజించి యుండును. దాసుగారిబోధలవల్ల బిక్కవోలునందు విషమసమయమున విజృంభించిన కులకలహములు మాసి ప్రజలందఱు భక్తితత్పరులై పరమేశ్వరుని సేవించుట సిద్ధించెను.

1928 ఫిబ్రవరిలో శ్రీ దాసుగారు బిక్కవోలులో గోలింగేశ్వరస్వామివారికి కోటి పత్రిపూజ సంకల్పించి బహుభంగుల శోధింపఁ బడి కని విని యెఱుఁగని వైభవమున నిర్వహించిరి. కోటి పత్రిపూజ నూరుదినములు జరుగుయాగము. వీ రెట్టి ప్రయత్నము ముందుజేయు నాచారము లేదు. చేతఁ గాసు లేక యాగ మారంభించిరి. పురాణ దంపతులగు పార్వతీపరమేశ్వరులే వీనికి యజమానులనియు తాము దండూరవేయు బంటనియు, నూరు రోజులపూజ కేవిధమైన లోపము వాటిల్లక వారే జరిపెద రనియు దాసుగారు నుడివెడివారు. వీరి యాస్తిక్యబుద్ధి యనుపమానము.

కాకున్న 100 రోజులయజ్ఞ మొనర్ప నెట్టియత్న మొందఁ జెందఱో యెంతకాలమో చేసినగాని జరుగు నవకాశ ముండదని యంద ఱెఱింగిన విషయమే. పరమేశ్వరప్రీతికొఱకు, లోకకళ్యాణ మపేక్షించి, నిరహంకారుఁడై నిష్కాముఁడై నిరాడంబరముగ సర్వ మాతనిపై మోపి భక్తుఁడు సంకల్పించిన దైవకార్యమునకు శ్రీనాథు డేలోటు రానీయక నిర్వహించునను గాఢనమ్మకము శ్రీదాసుగారికిఁ గలదు. శ్రీ భద్రాచలరామదాసుగారివలెనే వీరికిని దా నెక్కినది మునుగకొమ్మ కాదని గాఢవిశ్వాస ముండుటచేతనే యేయత్నములేక పలుతావుల

బెక్కుమహాత్కార్యము లాచరించు ధైర్యము వీరికిఁ గలిగినది. వీరు చిక్కవోలునందుఁ గోటిపత్రిపూజ నొనర్చుసమయమున ద్రాక్షారామవాస్తవ్యులును, వేదాధ్యయనసంపన్నులునునగు జోగావధానులు గారొకనాఁటిమధ్యాహ్నమున వీరిని దర్శించి తాము దాక్షాయణీ యగు మాణిక్యాంబయొద్దనుండి యరుదెంచిన దూత యనియుఁ, దమ కొక స్వప్నమున మాణిక్యాంబ దర్శనమిచ్చి తనకు కోటికుంకుమపూజఁ జేయఁజాలు భక్తుఁడు చిక్కవోలునందున్న వాఁడనియు, వానికిఁ దన సందేశముఁ దెల్పి ద్రాక్షారామమున కోటిబిల్వార్చనయుఁ, గోటి కుంకుమార్చనయు నొనర్ప నాహ్వానింపవలయు నని తమ్మాజ్ఞాపించె ననియు నుడివి దాసుగారిని దేవియాజ్ఞఁ బాలింపవలసినదిగాఁ గోరిరి. ముందు వత్సరమునఁ దా మరుదెంచి దేవియాజ్ఞ నెఱవేర్తు మని దాసుగారు వాగ్దాన మిచ్చిరి.

---

## ౧౨. భార్యావియోగము.

చిక్కవోలు సప్తాహానంతమున లింగరాజుగారు కోవెలకుంట్ల తాలూకా లింగముదిన్నె ఫిర్కాకు రివిన్యూయిన్స్పెక్టరుగా మార్పఁ బడిరి. వీ రచ్చటచ్చట తమ ధర్మపత్ని యీ సంవత్సరము గతించు ననియుఁ, బిమ్మట ననేక మహాత్కార్యనిర్వహణభారముఁ దాము వహించవలసి యున్నదనియుఁ జెప్పుచుండెడివారు.

గర్భిణిగానున్న భార్యను దమ యత్తవారింటికి ప్రసవమునకై తీసికొనవెళ్ళిరి. అచ్చటకుఁ జేరిన కొలఁదిదినములకే యామెకు శరీరమున శోభ (వాపు) కనుపింప దాపుననున్న రాణ్మహేంద్రవరమున నున్న ఘోషాఆస్పత్రికిఁ గొంపోవ వీరి మామగారు ప్రయాణము చేసిరి. తమ సెలవు తీరుటచేఁ దిరిగి నంద్యాలకు వచ్చిన దాసుగారు, తమ భార్య మరణావస్థయం దుండెననియు సత్వరమున వెళ్ళవలయు ననియు సబ్ కలెక్టరుగారికిఁ జెప్పి సెలవుఁ బుచ్చుకొని విశ్వేశ్వరము

నకు వచ్చునంతలో వీరి మామగారు సంగమేశ్వరమ్మగారిని సవారి యందుంచి రాజమండ్రికిఁ గొంపోవ బయలుదేరుచుండిరి. నాధుని గాంచినంతనే యాసాధ్వి వీరిని దగ్గరకుఁజేరి వీరిచేతులతో కొంచెము కాఫీ నియ్యమని ప్రార్థించెను. కాఫీకొఱకు సవారి దిపిరి. కాఫీని దయారుజేసి తెచ్చిరి. దాసుగారు కాఫీపాత్రమును భార్య కందియ్య నామె కొంచెము త్రాగి కృతజ్ఞతఁదెలుపు మందహాస మొనరించి తానుధన్యతఁగాంచినరీతిఁ బరమశాంతమున 'నారాయణ'యని కన్నులు మూసెను. దీనితో దాసుగారికి పత్నీవియోగము తటస్థించెను. అది శుక్లసంవత్సర ఆషాఢ శు ౧౧. వెంటనే సవారియందున్న తమసతి మృతకళేబరమును దింపించి యామెశిరమును దమతొడపై నిడుకొని దీర్ఘాలోచనలో మునింగి యుండిరి. బంధువులు గొల్లు మని చుట్టు మూగిరి.

తమయుపాసనాదైవ మపుడు తమకు చక్షుర్గోచరము కాగా శ్రీదాసుగారు "ప్రభూ! బహుకాలము సంసారసుఖ మనుభవించిన ముదుసలికిసైతము భార్యావియోగము దుర్భరమైయుండ ముప్పది రెండు సంవత్సరముల యువకుఁడను, నలుగురు పసిబిడ్డలు గలవాఁడను నగు నా కీవియోగ మేల కూర్చితివి?

తండ్రీ! రేపటినుండి తల్లిలేని యీ చిన్నిపాపల నాదరించి పోషించువా రెవ్వరు? నేను నీభక్తుఁడ నగుటచే నన్ను విషయభోగ ములనుండి తప్పింప నీవియోగము సంఘటించితివేని నే నిదివఱకు నీపేర, నీప్రీతికొఱకుఁ గావించిన, సమస్తకార్యములయందును, నా భార్య చేదోడువాఁదోడుగా నుండెఁగదా! నేఁ బురుషులయందుఁ గృషిసలిపినఁ, దాను స్త్రీలలోఁ గృషియొనర్చి నీమీఁదిభక్తి వారికబ్బు నట్లు చేయుచుండెఁగదా! యువకుఁడ నెట్లు రేపటినుండి, స్త్రీ సంఘమునఁ జొరనేర్తును. ఈ వియోగముచే నన్నిహాపరములనుండి దూరస్థునిఁజేయ నెంచితివే" యని ప్రశ్నించెను.

అంతట "కోరీ! నీ వెవ్వరిని భార్యగాఁ దలపోసి వాపోవుచుంటివో, యట్టి వ్యక్తిని నీ కిదె చూపెదఁ జూడుము. ఈ స్త్రీ పూర్వ

మెంతమంది పురుషులకు భార్యగా నుండెనో కనుఁగొంటివే? ఇఁక నీపూర్వజన్మలును, నాయాజన్మలయందు నీవు భార్యలుగాఁ బడసిన స్త్రీసముదాయమును జూడుము." అని పరమేశ్వరుఁడు బయస్కోపు బొమ్మలరీతి శ్రీదాసుగారి కన్నులకనేకవ్యక్తులఁ జూపించెను. అందుఁ దాఁ దిర్యగ్జంతుజన్మములనున్న విధమును, భార్యలుగా బడసి సుఖించిన స్త్రీ జంతుజాలమును, గిరాత బోయ మున్నగు నధమ పురుషజన్మంబులను, దనకు భార్యలైన యా యా జాతిస్త్రీలను నొక్కసారిగాఁ జూచి యాశ్చర్యచకితులైరి.

"ఓరీ వీరందఱు నీకు పూర్వజన్మంబుల భార్యలుగదా! వీరిలో నొక్కతె వియోగమునకేని నీ విపుడు దుఃఖింతువా? వారి వలెనే యీ జన్మంబునందలి భార్యనుగూడ నేలచూడఁజాలవు? నీ మీఁది వాత్సల్యమునసే యీ వియోగము గూర్చితిని. ఈయమ పరమసాధ్వి. నాకుఁ బ్రియమగు నేకాదశిరోజున బ్రాణముఁ బాయు టచే నీమె నాలోకముం బొందును. నీ బిడ్డలు దిక్కుమాలినవారు గారు. ఇప్పటినుండియు లోకమంతయు నా పాపలకుఁ దల్లిదండ్రు లై సర్వవిధముల నాదరించి పోషింతురు. కావున మోహము విడిచి సత్కార్యదీక్షితుఁడవు గ"మ్మని భగవంతుఁ డంతర్ధాన మయ్యెను.

అంత దాసుగారును దుఃఖమును మఱచి దేహము గగుర్పా నానందాశ్రువులు బ్రవహింపఁ బరమానందమునఁ దేలియాడి చుట్టు మూగి రోదనమొనర్చు నాప్తబంధువులఁ జూచి వారి దుఃఖోపశమన ముఁ జేయ ని ట్లుపన్యసించిరి.

"మీరెల్ల రీ మృతకళేబరమును గూర్చి యేల దుఃఖపడెదరు?

'జాతస్యహి ధృవో మృత్యుః ధృవం జన్మ మృతస్య చ,
తస్మాదపరిహార్యార్థే న త్వం శోచితు మర్హసి.'

పుట్టిన ప్రతిజీవికి మరణము తప్పదు. మరణించిన జీవికి జన్మము తప్పదు. కాఁబట్టి యనివార్యములగు నీచావుపుట్టుకల కేల కలఁత

నొందెదరు. ఉత్పత్తి నాశనము లవశ్యము సంభవించును. కావున శోకింపఁ బనిలేదు.

'అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత,
అవ్యక్త నిధనాన్యేవ తత్ర కా పరివేదనా?'

ఈ శరీరము కలుగకమును పెట్టిదో తెలియదు. పుట్టినపిమ్మట మాత్రమే తెలియఁబడుచున్నది. మఱల నశించినపిమ్మట నేమగునో తెలియదు. కావున నిట్టి తెలియనివిషయమునకు విషాదమేల? మరణించునది శరీరముమాత్రమే. ప్రతిక్షణమును దీనియందు మార్పుగలుగుచునే యుండును. సమస్త ప్రాణికోటిలోఁ జావకుండునదొక్కటియును లేదు. మనశరీరములుమాత్రము శాశ్వతమా? ప్రతిక్షణము మృత్యుదేవత మనల వెన్నంటియే యుండును. ఏ క్షణమున నేశరీరి మృతి నొందునో యెవరి కెఱుక? మనకండ్లముంద నేకమంది పుట్టుట గిట్టుట చూచుచున్నారము. పరమేశ్వరుని మాయకు లోనై నేఁ బుట్టితి, నేఁ జచ్చితి నని జీవుఁడు భ్రమించుచున్నాఁడు. జీవుఁడు సనాతనుఁడు. నిత్యుఁడు. జననమరణము లాతనికి లేవు. శరీరమునకు బాల్య యౌవన కౌమార వార్ధక్యము లెట్లు సంఘటిల్లుచున్నవో యటులనే జీవుఁ డీ శరీరమును వదలి మఱియొక దేహమును బొందుచున్నాఁడు. అందు వల్లనే శ్రీకృష్ణుఁడు

'వాసాంసి జీర్ణాని యథావిహాయ నవాని గృహ్ణాతి నరో పరాణి
తథాశరీరాణి విహాయ జీర్ణా న్యన్యాని సంయాతి నవాని దేహీ'

యని నుడివినాఁడు. మనము చినిగిన పాతవస్త్రములను వదలి నూతనవస్త్రముల గ్రహించినటుల జీవుఁడును జీర్ణములైన దేహములను వదలి క్రొత్తశరీరములఁ బొందుచున్నాఁడు. ఇట్టి సహజమగు మృత్యువనిన వగ పెందులకు?

ప్రపంచ మొక బూటకమగు నాటకము. తన దివ్యలీల కొఱకు భార్యాభర్తలని, జననీజనకులని, బంధువులని, మిత్రులని, శత్రులని సంబంధమును దన మాయచేఁ గల్పించి పరమేశ్వరుఁడు మనచే నాటలాడించుచున్నాఁడు. నిజముగ నీసంసారాంబుధిలోఁబడి

పెక్కుజన్మంబు లధోగతి నందుచున్నవి. ఈ మర్మమును గ్రహించితి మేని మరణము సంసారసాగరమునుండి తరింపఁజేయు నీశ్వరదత్త వరముగాఁ గన్పట్టు. అందులకే శంకరాది మహానుభావు లనేకులు సంసారశ్శృంఖలములఁ జిక్కుకొనక బ్రహ్మచర్యమునుండియే బ్రహ్మ జిజ్ఞాసువులై తరించిరి.

ఇట్టి మృత్యువువల్ల నా కెట్టి విముక్తి కలిగినదని మీరు ప్రశ్నింతురేని చెప్పెద నాలకింపుఁడు. పదునాలుగు వత్సరంబులు ద్వీపాంతర వాసశిక్ష విధింపఁబడి యండమానుదీవులకుఁ గొంపోఁబడిన శిక్షితుఁడు తన శిక్షాకాల మెట్లో గడిపి బంధవిమోచన మంది స్వేచ్ఛగా స్వదేశమునకుఁ బోవుచుండ నేవిధమగు నానందము ననుభవించునో యదేరీతిగ నేఁడు నాశరీర మాపాదమస్తకము పులకాంకితమై చిదానందముతో నిండియున్నది. కారణమేమన నే నీపదునాలుగు సంవత్సరము లెంత సంపాదించినను నెన్ని భోగభాగ్యము లనుభవించినను భార్యయను సంకెలలో దగులువడి చిక్కుటచే మోహమున భోగభాగ్యములయెడ, దారాపుత్రాదులయందు, ధనకనకవస్తువాహనముల పట్టున మమకారముగలిగి ముక్తిమార్గ మారయనేరక నాకు జ్ఞానమబ్బినదాది నాయీ జన్మమును వ్యర్థపఱచితి. ఇప్పుడన్ననో యీ సంకెలులు విడివడుటంజేసి నాజన్మహక్కగు స్వేచ్ఛ నాకబ్బినది. మాయ యన నిట్టిది. దీనికి లోఁబడకుఁడు. దీనిం దరించు నుపాయ మిది యని తోడిమానవులకుఁ జెప్పి జన్మ మెత్తినందులకు సార్థముగ లోకసేవఁ జేయఁగడంగెద. భగవానుఁడు తమ భక్తుల బహుభంగుల శోధించుననుట కిది యొకగొప్పనిదర్శనము. తదేకదీక్షతోఁ దన్ను భజించువారి కనేక కష్టములు గల్పించి వారి మనశ్శుద్ధిఁ బరీక్షించును. ఆకష్టముల కేభక్తుఁడేని జంకక చలింపక నిశ్చలుఁడై కష్టసుఖంబులు పూర్వకర్మోపార్జితము లని యెంచి పరమేశ్వరుని వెన్నాడిన నావు వెంటఁబడు నాఁబోతువలె భక్తపరాధీనుఁ డగును. ఇంతటితో నా పరీక్షాకాలము ముగిసినది. ఈశ్వరునిఁగూర్చి నే నొనర్చిన పూజ ఫలోన్ముఖమునకు వచ్చినది. నే నీ భార్యావియోగమునకు నించుకేనియుఁ

జింతింపక దీని నొక వరప్రసాదముగఁ గైకొనుటచే భగవంతుఁడు సంత సించెను. మున్ముం దెట్టి ఘనకార్యములైనను దృణప్రాయముగ నాచేఁ జేయించు నని నే విశ్వసింతును.

ఈ సందర్భమున నొక చిన్నకథఁజెప్పెద నాలకింపుఁడు. ఒకా నొకదినమున నరనారాయణులగు శ్రీకృష్ణార్జునులు భూసంచారముఁ జేయుచు నొకచో నొక సంపన్నగృహస్థుం జేరి భోజన మర్థించిరి. అతఁ డియ్యకొనఁ డయ్యెను. శ్రీకృష్ణుఁ డాతని కష్టైశ్వర్యము లబ్బునట్లు వరం బొసంగి, యొక బీదబ్రాహ్మణు నింటికేగి యన్నం బడుగ నత డత్యాదరంబున నర్ఘ్యపాద్యాదు లొసంగి గౌరవించి భోజనం బొసం గెను. భోజనమైనపిదప కృష్ణుఁడు వాకిటనున్న యొకగోవుం జూచి సౌందర్యము నభినందించుచు హస్తంబున నిమురునంత నా యావు ప్రాణంబులఁ బాసెను. పార్థుఁ డది గాంచివిస్మయమంది "బావా! నీ చారిత్రం బద్భుతంబు. నీమాయం దెలియ నేరికి సాధ్యము కాదు. నీ కాహారమైన నిడనొల్లని యవివేకికి సిరు లిచ్చితివి. ని న్నాదరించి భోజ నం బిడిన నిరుపేదబ్రాహ్మణుని యేకమాత్ర సంపదయగు గోవుం జంపితివి. దీనిభావమే"మని యడిగెను. అందు కతఁ "డీ బ్రాహ్మణుఁడు నాభక్తుఁడు. సర్వసంగములఁ బరిత్యజించియు నీ యావునందలి ప్రేమ పాశమును ద్రెంపఁజాలకున్నాఁడు. వీని ననుగ్రహింప దీని నిట్లు హరించి నాభక్తుని బంధవిముక్తునిఁ జేసితి" నని ప్రత్యుత్తర మిచ్చెను.

కావున బాగుగ యోజించి మరణ మనునది మనకు బంధవిమో చనముకాని వేరొండు కాదు. శరీరము బుద్బుదమువంటిది. ఇట్టి యశా శ్వతమైన శరీరముకొఱకు తప్పనిసరియైన మరణముంగూర్చి విషాద మందుట యవివేకము. కాన మీ రూరటఁజెంది నాభార్యగానుండి చనిన యీ జీవిముక్తికిఁ బరమేశ్వరు ధ్యానింపుఁడు. దానఁ జనిపోయిన వ్యక్తికిని బ్రతికియున్న మనకును నాత్మమనఃశాంతులు కలుగును."

అంతట బంధుగులంద ఱచ్చెరువంది యూరటఁజెందిరి. పిమ్మట దాసుగా రత్యానందమునఁ దమభార్య కుత్తరక్రియ లాచరించిరి.

# ౧౩. ద్రాక్షారామము – కోటిపత్రిపూజ

ద్రాక్షారామమునఁ దొల్లి ప్రజాపతులలో నొకఁడగు దక్షుఁడు బృహస్పతినామకయజ్ఞమును దన యల్లుఁడైన శివు నవమానించుటకుఁ జేయ నారంభించెను. శివుఁ డాహ్వానింపఁబడని కారణమున వెళ్లఁడయ్యెను. దాక్షాయణి జనకుఁ డాచరించు యాగముఁ జూడ నభిలషించి పుట్టినింటిపైఁగల మమకారమునఁ బిల్వకుండినను భర్తయనుజ్ఞఁ బడసి చని తండ్రిచేఁ దిరస్కృతయై యోగాగ్నిని దగ్ధయయ్యెను. మహేశుఁ డిది యెఱింగి కోపావేశము నంది దక్షయజ్ఞధ్వంసమొనర్చుటకు వీరభద్రుని సృష్టించి సవనధ్వంసముఁ గావించి దక్షు నజముఖుం జేసెను. నాఁడు మొద లీగ్రామమున నెట్టి యజ్ఞములును సేయుటకు విఘ్నమగు నను భయమున సమకట్టకుండిరి.

మఱియుఁ దొల్లి పాలసముద్రమును దరచునపు డొక లింగ ముద్భవంబయ్యెను. ఆలింగ మిందుఁ బ్రతిష్ఠింప నెంచి వసిష్ఠాది మహర్షులు ముహూర్త మేర్పఱచి గోదావరిజలంబులఁ గొనిరాఁ జన మార్గమున రాక్షసనిరోధము తటస్థించుటంజేసి ముహూర్తకాలమునకుఁ దిరిగి రాఁజాలకపోయిరి. మునులుంచిన ముహూర్తముననే లింగము తనంతఁ బ్రతిష్ఠనొందెను. దానంజేసి యీ లింగమును స్వయంభు వందురు. ఆ లింగమును మొట్టమొదట సూర్యభగవానుఁ డర్చించెను. ఈ విషయము స్థలపురాణమున వర్ణింపఁబడియున్నది.

శ్రీ శంకరాచార్యులవారిచేఁ బ్రతిష్ఠింపఁబడిన యష్టాదశపీఠంబులలో వన్నెకెక్కిన మాణిక్యాంబాదేవి యీ క్షేత్రాధిపురాలు. త్రిలింగములలో నొకటి. ఇచ్చటనే వేములవాడ భీమకవి జన్మించెను.

ధర్మపత్ని గతించినదాది సెలవుపైనున్న మాన దాసుగా రొక స్మారకముగ నీ క్షేత్రమునఁ గోటిపత్రిపూజ సలుప నిశ్చయించి శుక్ల సంవత్సర ఆషాఢ బహుళ అమావాస్య నాటి రాత్రి ద్రాక్షారామముం జేరిరి. మరునాఁ డుదయమునఁ గోటిపత్రిపూజ ప్రారంభ మగును. చేతఁ గాసు లేదు. గ్రామము క్రొత్త. యత్న మిదివఱకుఁ జేయలేదు.

వీరు వచ్చునప్పుడు నాల్గుబస్తాల మారేడుదళంబులఁ గొనివచ్చిరి. మరునాఁడు వరువాత లేచి సప్తగోదావరియందు స్నానముఁ గావించి భీమేశ్వరాలయమున నున్న విఘ్నేశ్వరుని తాము దెచ్చిన నీట నభి షేకించి సంభ్రమాశ్చర్యనిమగ్నులగు బ్రాహ్మణులతో పూజాసం కల్ప మొనరించిరి. అచ్చటఁ గల యర్చకులు మున్నుగువా రిది వెఱ్ఱి వానిపని యనియు మహామహు లెందఱో క్షేత్రమునకుఁ గల శాప ముఁ దలంచి యేకార్యము దలపెట్టక మిన్నకుండ నీ పిచ్చివాఁ డొకఁడు చేతఁ గాసులేక కోటిపత్రిపూజఁ జేయ వచ్చినాఁ డనియు నవ్వసాగిరి.

అంత దాసుగారు వారిం గాంచి "అయ్యలారా! జనని మాణి క్యాంబాదేవియే యీ కోటిపత్రిపూజ సంకల్పించినది. నేను బిక్క వోలు కోటిపత్రిపూజలో నున్నప్పుడే యీమె న న్నాహ్వానించిన దనుట కీ జోగావధానులుగారే సాక్షిభూతుఁడు. వారే నాఁడు మాణిక్యాంబాదేవిపంపున నాకడకు వచ్చినదూత. ఈ యాగము నకుఁ గర్త సర్వలోకాధినాథుఁడు, పాలాత్ముఁడు నగు భీమేశుఁడు. నేను డముకు మ్రోయించు తప్పెటవాఁడను ఐశ్వర్యప్రదాత యీశ్వరుఁ డని మఱచితిరే! ఆ మహామహుఁడు తలఁచినఁ గుబేరుని నవనిధు లిందు వచ్చి పడవా? జనని మాణిక్యాంబాదేవి యీ కార్యమును నిర్వ హించు బాధ్యత వహించినది. అద్దేవిశక్తిసామర్థ్యములు బ్రహ్మ వేత్త లగు మీ రెఱుంగనివి కావు. కాన కోటిబిల్వార్చనయు, కోటి కుంకుమార్చనయు నతివైభవమున జరుగును. పూజ కుపక్రమిం పుఁడు. దీని నడ్డుపెట్టఁగలవార లెవ్వరును లే రని దృఢముగ విశ్వసిం పుఁడు. ఇయ్యది యీశ్వరసంకల్ప మగుటచే నిరాటంకముగ జరిగి తీరును." అని నుడివిరి.

ఇంతలో బిక్కవోలునుండి బ్రాహ్మణదంపతు లరుదెంచి ప్రథమపూజఁ దమనామగోత్రములతోఁ జేయఁ బ్రార్థింప నట్లే వారి నామగోత్రములతో జరిపిరి. ఇట్లే తలవని తలంపుగ పూజలిచ్చువారు వచ్చుచుండ నయ్యాగము దినదిన ప్రవర్ధమానమై కడుశోభాయమానమై జరుగ నారంభించెను.

ఈ యాగవిఘ్నమునకుఁ బలువురు బలవంతులు దేవాలయధర్మ
కర్తను లోఁబఱచుకొని యత్నించిరి. కాని దైవసంకల్పమున యాగము
జయప్రదముగా నెఱవేరసాగెను. ఒకనాఁటి రాత్రి యేఁబదిమంది
దుర్వినీతులు మద్యముఁ ద్రావి దాసుగారిని గొట్టవచ్చిరి. పరమేశ్వ
రానుగ్రహమున దాసుగారి యుపన్యాసము వినుటతోడనే నమ్రులై
యాగము పూర్తియగువఱకు నడుముఁ గట్టుకొని పనిచేసిరి. చుట్టు
ప్రక్కలగల గొప్ప గొప్ప జమీందారులు, రైతులు, సంపన్నగృహ
స్థులు, పలుకుఁబడిగలవారలు పెక్కుమంది పూజచివరరోజులలో కార్య
భారము వహించి యఖండదిగ్విజయముగా కార్యసమాప్తి నందించిరి.
తుద "కీరితిఁ గార్యము మున్నెన్నడు జరుగలేదు. ఇఁక ముందెప్పుడు
జరుగఁబోదని ప్రతివారినోటినుండి వినవచ్చెను. ఈ మహాయజ్ఞమున
నిలిచి కార్యభారము వహించిన ధన్యులు-మామిత్రులు పలువురు
గలరు.

పూర్ణాహుతిగుండమున పదివేలరూప్యముల విలువగల హోమ
ద్రవ్యములు వేల్చఁబడెను. ఆదినమునఁ గూడిన ప్రజాసముదాయ
మొకలక్షకు పైగా నుండెను. ఇంత సమూహ మామండలమున
నెన్నడును గూడియుండదు.

ఆంధ్రదేశమున మొదట కోటిపత్రిపూజావిధానమును వెలి
వరచి పీఠికాపురమున నతివైభవముగ కోటిపత్రిపూజ జరిపిన శ్రీ
గరిమెళ్ళ విశ్వనాథశాస్త్రిలవారు పూర్ణాహుతిసమయమునకు వచ్చి
"జయమొందితివి నాయనా! మహత్కార్యము నిర్వహించితి" వని
యానందాశ్రువులు రాల దాసుగారిని కౌఁగిలించుకొని పరమాహ్లాద
మును వెల్లడించిరి.

దాసుగారు కోటిపత్రిపూజ జరుగు దినములలో నావరణమునఁ
గల యారామమునం దొక చిన్నపంచెను మొలకుఁ గట్టుకొని
యాసీనులై యుపన్యసించుచుండెడివారు.

వీరిఁ జూడ జనులు దూరగ్రామములనుండియుఁ దండోప
దండములుగ వచ్చి రాత్రింబగళ్లు మూఁగియుండెడివారు. వచ్చినవారి

కెల్ల నేదో యొక యుపన్యాసమును భక్తింగూర్చి, విసువుజెందక శ్రీ దాసుగారు చెప్పుచుండెడివారు. వారియుపన్యాసము పండిత పామరజనహృదయరంజకముగాను, భక్తిభావము వెదజల్లునదిగాను నుండును. ఎంతకాలము వినినను ప్రజలు విసు వనునది యెఱుఁగరు. ఈ బిల్వార్చనదినములలో నొకనాఁడు శ్రీ దాసుగారు చెప్పిన యుపన్యాసము నీక్రిందఁ బొందుపఱచితిమి.

"సోదర సోదరీమణులారా! మీ రందఱు మన ముసలమ్మను (మాణిక్యాంబాదేవిని శ్రీ దాసుగారు ముద్దుగా ముసలమ్మ యని పిలుతురు.) జూడవచ్చితిరే. అబ్బా! ఈ మనతల్లి సామాన్యపుఁ దల్లి కాదు. శ్రీ శంకరభగవత్పాదులవారిచేఁ బ్రతిష్ఠింపఁబడిన యష్టాదశపీఠంబులలో వన్నెఁగాంచిన మన మాణిక్యాంబ ప్రస్తుత మీ రాజ్యమునఁగల ప్రతివ్యక్తినిఁ దరింపఁజేయఁ గంకణముఁ గట్టి 2000 సంవత్సరముల నుండి యోగనిద్ర నున్న భీమేశుని మేల్కొలిపి "ఈ ఖండవాసులగు మనబిడ్డలు ధర్మహీనులై, యధర్మావలంబులై మతదైవాభిమానముల వీడి, కలిమాయం జిక్కువడియుండిరి. ఇట్టితఱి తల్లిదండ్రులమగు మన మూరకుండుట మేరగాదు. వీరిని దరింపఁజేయవే" యని వేడెను. తల్లియనుమతిని భీమన్న యే యీ క్రతువుఁ బన్ని నన్నుఁ జూచి "ఓరీ! నీవు టముకుమ్రోయించుటలోఁ గడు దిట్టరివి. రమ్ము! నాయాలయసింహద్వారముకడ నిలిచి శ్రీ భీమేశ్వరునకుఁ గోటి బిల్వార్చన - జనని మాణిక్యాంబకుఁ గోటి కుంకుమార్చన" యని చాటింపు మని యీ నిరక్షరకుక్షిని (శ్రీ దాసుగారిని) నియమించెను. మంచిది. పోండు. మాణిక్యాంబదగ్గఱకేగుఁడు. భీమేశ్వరుదర్శింపుఁడు. వారికి మ్రొక్కుఁడు. వారి సెలవుచొప్పున మెలఁగుఁడు. వారే యే వ్యక్తులచే నేమేమి సేవలు జేయించుకొన నిచ్ఛగింతురో యా విధమున జరిపింతురు. గతజన్మంబులఁ గామ్యముల నాసింపక పరమేశుఁ బూజించిన భక్తుల హృదయకుహరమున భీమేశ్వరుఁడు సతీయుక్తుఁడై వసించి వారిని చక్కగా శోధించి మాలిన్యరహితులఁజేసి యాపూతచరిత్రుల నందఱిఁ దనసన్నిధికి రప్పించి యుద్ధరించు నుద్దేశమున

వారిచే నిట్టి ఘనకార్యములయందు సేవఁజేయించుకొనును. ఇట్టి కార్యమున దీక్షవహించి కార్యభారము వహించు భక్తులలో నిష్కాముఁలగువారలకు జ్ఞానోదయమును విషయార్థకాముల నుచితరీతిఁ గోటీశ్వరులుగను, లక్షాధిపతులుగను, రాజ్యాధిపతులుగను జేయసమర్థుఁ డట్టి మనభీమేశ్వరుఁడు చేతఁ గాసు లేని యాంతరంగికభక్తుల నిందు రావించి వారిచేఁ దనసన్నిధానమున వివిధవిధుల దాస్యము జేయించుకొని తరింపఁజేయును. కామ్యాపేక్షచే భజించు భక్తులకు సకలకామితార్థముల నొసంగి సకలైశ్వర్యంబులఁ గూర్చు. భక్తులారా! మనలింగ డుబ్బులరాయఁడు. "శివా మహాప్రభో" యనిన ఓ యని పలుకును. గతజన్మంబుల భోగాపేక్షచే భజించిన వారల నీ జన్మంబున ధనకనకవస్తువాహనసమృద్ధులనుగాఁ జేయ, వారు ధనమదాంధులై తమభవనములే కైలాసము - తమభోగములే దేవేంద్రభోగము లనుచుఁ, దామేయధికు లనుచు బిన్న పెద్దతారతమ్యముమఱచి జ్ఞానాజ్ఞాన విచక్షణదూరులై పరమభాగవతుల దూరుచు, పెద్దల నిందింపుచు, సోదరులయందుసైతము ధనలోభమున నసూయాపరులై పితృమాతృభక్తిలేక పేదసాదుల బాధించుచుఁ దమ సంపద్దాతయగు సర్వేశ్వరుని మఱచి తమవైభవమంతయుఁ దమ తెలివితేటలచే సంపాదించితి మను నహంభావమునఁ గ్రిందుమీఁదెఱుంగక వర్తింతురు.

వీరు కలిమహారాజున కత్యంతముఁ గూర్చు ప్రజలు. వీరిం జూచి కలి యానందించి వారిహృదయంబుల నెలవుఁ జేసికొని తన భటులగుఁ గామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాదు లనియెడి దండనాథుల కప్పగించు. వారలఁ గాంచి కలి మనంబున నిట్లు తలంచుచుండును.

"ఆహా నాప్రజలు సర్వసంపదలతోఁ దులఁదూగెదరు. నా విరోధియగు వైకుంఠభక్తులు నీచదారిద్ర్యముల కాకరులై యిహమున సుఖ మనున దెఱుంగక మాడిమాడి, పలునిడుములకులోనై యల్లాడెదరు. నాబిడ్డ లెట్టిపట్టునసైన ధనము నతిగోమునఁ దమ ప్రాణములకంటె మిన్నగఁ గాతురు. నాపగతుని భక్తులు లేమిచేఁ

గుందుచున్నను నిర్దాక్షిణ్యబుద్ధిచే వారికిఁ గల స్వల్పైశ్వర్యమును వారినుండి దానమని, ధర్మమని, మంచియని, చెడ్డయని వెచ్చింపఁ జేయుదురు. నాభక్తుఁడు తనధన మొరులకుఁ బెట్టక తా ననుభవింపక, లుబ్ధాగ్రేసరుఁడై పిల్లికిని బిచ్చముఁబెట్టక ధనమునం దతిప్రేమచేఁ గాటిచెంత నక్కవలె జంతుసామాన్యమగు నిద్రాహారముల సైతము ఖరచి ధనాగారమును గాయుచు నా కత్యంతానందమును గూర్చును. ఒకవేళ నట్టివా రిట్టి తప్పెటవారిచెంత కరుదెంచిన 'వానిబుద్ధి మారు నేమో? ఇన్నిరోజులనుండి కడుగారాబంబునఁ గాచినధన మే మగునో!' " యని చింతించును.

అట్టి కలియుఁ[?]కీనమునను న్న మహామహులిచ్చటకు రా నేరారు. ఒక్కచో నొక యుత్తమవ్యక్తి స్నేహపుమోమోటంబుల రాఁ దటస్థించెనేని కలిగాఁడు తనకొంప మునింగిపోయినట్లుగాఁ దత్తరపడుచు "ఓనా ముద్దులబిడ్డా! నిన్ను బాల్యంబునుండి గారాబంబుగాఁ బెంచి, నాదండనాథులలో నొకఁడగులోభమూర్తిచే విద్యాబుద్ధులు గఱపించి, నిన్నుఁ గోటీశ్వరు నొనర్చితి. నీప్రారబ్ధవశంబున నిప్పు డీవట కరుదెంచితివి. నీ వీ టమును వానిఁజూడ వచ్చితివే! నీగురువగు లోభదేవునివిద్య మరువకుమా? అది మఱచిన నీ కొంప గూలిపోవునుసుమా! వీఁడు కపటనాటకసూత్రధారియైన పరమేశ్వరునిభక్తుఁడు. వీనికిని మనకును జాతివైర ముండుట మఱువకుము. వీఁ డెన్నియో కపటోపాయంబులఁ బన్ని నీమనంబును విద్యుద్యంత్రమ ట్లాకర్షించి యీ పాడుకోటిబిల్వార్చనకు, నిన్నిరోజులు వృద్ధిఁజేసి పెంచిన గారాబు ధనలక్ష్మిని వెచ్చింపఁజూచును. కాన నీ నిర్భాగ్యపుగోచిపాతరాయుని మాటలఁ జెవిఁ జొరనీయకుము. వీనిపన్నాగములఁ బడకుండ నప్రమత్తుఁడవై మెలంగుము." ఇట్లు కలిగానిచేఁ బ్రబోధితులైన ధనాఢ్యులకే క్రతుధర్మములుఁ గోచరింపకుండును. కలిగాని బిక్షలంద ఉ[?] రజన్మంబునఁ బెద్దమ్మ కడుపుఁ బుట్టి తిరుపతికొండ 82-83 మెట్లవద్ద "కాళ్లులేవు, కండ్లులేవు బాబోయి దమ్మిడి, అమ్మోయి దమ్మిడి!" యని యల్లాడి యాకులు మేతురు. కాన భక్తులగు నో సోదరసోదరీ

మణులారా ! మీరందఱు నిష్కామబుద్ధితో నీశ్వరు భజింపుఁడు. తరింపుఁడు భవాబ్ధిని. పారములేని సంసారసాగరమునుండి యొడ్డెక్కుట కొక్కటే మార్గ మీ కలియుగమునఁ గలదు. అదెద్ది యన నే మనుజుఁడైన నిష్కామియై గాఢమగు విశ్వాసముఁ బరమేశ్వరుపై నుంచి త్రికరణశుద్ధిగా నొక్కముహూర్తమాత్రము భజించిన నీశ్వరుఁడు సాక్షాత్కరించుటకు సందియము లేదు. పిమ్మట నిహాపరముల కేమియు లోప ముండదు. కావునఁ బ్రజలారా! కలిగానిని, వానితోఁబాటు వాని దండనాధులగు గామ క్రోధ లోభ మద మాత్సర్యాదులను మీ మనంబులనుండి పారదోలుఁడు. ఎల్లరు భక్తసులభుఁడగు నీశ్వరు సేవఁ గాంక్షింపుఁడు. పరదారాధనాపేక్షల వీడుఁడు. కామినీకాంచనాపేక్షనుండి విముక్తులైన ముక్తి మీ కీ జన్మముననే చేతి కబ్బును చేతనైన, బుద్ధిపుట్టిన, నొక కాసుసొమ్ము నీశ్వరప్రీతమగు మహాయాగమునఁ గలుపుఁడు. లేదేని దీనిఁగుఱించి మీరు చూచినది మీ స్నేహితులకు వర్ణించి వివరింపుఁడు. దీనిని దిగ్విజయముగా నఖండవైభవోపేతముగా జరుగునట్లు కోరుఁడు. భక్తుల కోర్కులు రిత్తవోవు. ఈ యాగమునకుఁ గర్తలు పరమేశ్వరుఁడు-పరమేశ్వరి. నే నన్న-"కోటిపతిపూజో" యని టముకు మ్రోయించు కూలివాఁడను. చూడుఁడు నా వేషము. నేను సన్న్యాసిని గాను. దిగంబరస్వామిని గాను. నిర్బలుఁడను. కడు కురూపిని. కాషాయగుడ్డలు కమండలువులు రుద్రాక్షలు తులసిపేర్లు పులితోళ్లు గండ్రగొడ్డండ్లు నాయొద్ద లేవు. సంగీత సాహిత్య పాండితి మొదలే లేదు. ధనమా! గోచిపాతరాయఁడను. నాచేతఁ గాసైన లేదు. కార్యమా! దినమునకు వందలు వేలు ఖర్చగు మహాయాగము. స్థలమా! ప్రజాపతులలో మేటియగు దక్షునియాగవిఘ్నమయిన పట్టణము. కాని నాయొద్ద ధనమునకు మించినది, పాండిత్యమును దాటినది యొకటి కలదు. అది యే నారహస్యము. చెప్పమందురా? మీకంటె నన్నివిధములఁ దక్కువ యాగ[illegible] యీ కార్యముల సంకల్పింప మీ కట్టి క్రతువులు వేల సంఖ్యలుగ చేయఁజాలుదురు. నా రహస్యబల మిది— పరదారాపరధనంబుల నేఁ గోర. నేను టముకు వేసినందుకుఁ బరమేశ్వరుఁ డాదరంబున

నిచ్చుచుట్టలే నాజీతము. సర్వకార భారము పరమాస్తిక్యబుద్ధితో నే నాతనిమెడ వైచితి. దాని బాగోగులతో నాకు సంబంధము లేదు. జగత్సృష్టిస్థితిలయకారకుఁడగు పరమేశ్వరున కీ క్రతువు నెగ్గించుట యొక లెక్కయే? భక్తపరాధీనుఁడు మనశంకరుఁడు. భక్తులమగు మనసంకల్పముల వృథసేయఁడు. కనివిని యెఱుఁగనిరీతి క్రతువు సమాప్తమగును. మీరందఱు దీసమేలుగోరి యీశ్వరు భజింపుఁడు. 'జయ్ రమారమణ గోవిందా.'"

ఇట్టి యుపన్యాసములు ప్రతినిత్యముప్రతిగ్రామమున నిచ్చుచుందురు.

ఎట్టియాత్నము లేకయే నూరుదినముల కార్యము మహావైభవముతో జరుగుటకు ప్రజ లత్యాశ్చర్యము నందిరి. దాసుగారికి దాక్షారామవాస్తవ్యులేగాక చుట్టప్రక్కల ప్రజలెల్లరును బ్రహ్మరథముఁ బట్టిరి. పెదపళ్ళగ్రామవాసులు వీరి కిచ్చిన సన్మానపత్రము వల్ల శ్రీలింగమూర్తిగారిని ప్రజ లెట్టి గౌరవభావమునఁ జూచుచున్నది విశదము కాఁగలదు.

"శ్రీ పరమహంస సచ్చిదానంద శ్రీ పోణంగి లింగమూర్తి దాసుగారికి పెద్దపళ్ళగ్రామవాసులు భక్తితో సమర్పించిన స్వాగత పత్రము.

భరతవర్షమునఁ బాశ్చాత్యనాగరకతావ్యామోహము నానాఁటఁ బెచ్చుపెరుగుచు, నాస్తికత ప్రబలుచున్న యిక్కాలమునఁ దాము జ్ఞానయోగులై లోకము నుద్ధరింప నిష్కారణప్రేమతో దేశమంతటను కోటిపత్రిపూజలు, సప్తాహములు సంకల్పించుచు నిర్విఘ్నముగా, జయప్రదముగా సలుపుచున్న తమదర్శనభాగ్యము గ్రామవాసులము, మూఢులము నగు మాకు లభించుట మాపూర్వజన్మసుకృత మని తలఁచి మిగుల సంతసముతో స్వాగతమిచ్చుచున్నారము. ... ... ... ... ... ... ... ...

... ... ... ... ... ... మాగ్రామవాసులును, జమీందార్లును నగు శ్రీరాజా పరేల్ ఖానా వేంకటరామస్వామి, వేంకటసుబ్బారావు, భైరవరావుగార్లు యేటేట సలుపుచున్న శ్రీమ

దిందిరాపూజలు, శ్రీరామపట్టాభిషేకము, నిరంతరాన్నదానముల యొక్క విశేషఫలితమే మాగ్రామమునకు తమరాకకుఁ గారణమని తలఁచి మిగుల సంతసించుచున్నారము.

లోకమాన్య బాల గంగాధరతిలకు ప్రభుత్వాగ్రహమునకు గుఱియై మాండలేకోటలో నిర్బంధితులైయుండ వారి ధర్మపత్ని పరమపదించె నను వార్తను స్నేహితులు మిగుల విచారముతోఁ దెలుప — నా మహాశయుఁడు దా వ్యాఖ్యానము వ్రాయుచున్న గీతా వాక్యమును,

"వాసాంసి జీర్ణాని యథావిహాయ నవాని గృహ్ణాతి నరోపరాణి,
తథా శరీరాణి విహాయ జీర్ణా న్యన్యాని సంయాతి నవాని దేహీ॥"

యని వారి స్నేహితులకు సాంఖ్య యోగమును బోధించెను. అట్లే తమరును ధర్మపత్నీవియోగమును లేశమైన మనంబున నిడుకొనక నచిరకాలములోనే తా మీ కోటిపత్రిపూజ సంకల్పించుట మాబోటి మందమతులకు జ్ఞానమార్గముఁ బ్రబోధించుచున్నది.

* * * * *

తాము "తుల్యనిందాస్తుతి ర్మౌనీ సంతుష్టో యేన కేనచిత్" యనునట్లు స్మదాదుల పొగడ్తల నపేక్షించ రని తెలిసియున్నను భక్తుఁడు తన చిత్తశాంతికై పరాత్పరుని షోడశోపచారంబులచే బూజించి సంతసించునట్లు మేమును తమదర్శనభాగ్యము గలిగె నను సంతసమున నీ స్వాగతపత్రి మర్పించుకొనుచున్నాము.

పెదపళ్ళ, 10—11—29.

ఇట్లు విధేయులు,
పెదపళ్ళ గ్రామవాసులు.

కోటిపత్రిపూజ య ట్లద్వితీయవైభవమున ముగిసిన పిమ్మట జీర్ణావస్థనందిన దేవాలయప్రాకారగోపురమండపములఁ బునరుద్ధరింప నేర్పాట్లు జరిగెను. పెదపళ్ళ జమీందారుగా రా కార్యభారము వహించి పలుపుర శంకుస్థాపనామహోత్సవమున కాహ్వానించిరి.

దాక్షారామము - శ్రీ భీమేశ్వరస్వామివారి యాలయము.

స్వస్తిశ్రీ శుక్లనామసంవత్సర కార్తీక బ ౫ గురువారం ఉదయం ౧౧-౫ ఘడియలకు (ది 21-11-29 ఉదయ 11 ఘంటలకు) శ్రీమద్దక్షారామ శ్రీ మాణిక్యాంబాసమేత శ్రీ భీమేశ్వర స్వామివారి దేవాలయప్రాకారగోపురమండపజీర్ణభాగముల పునరుద్ధారణమునకు, శంకుస్థాపనామహోత్సవము శ్రీ స్వామివారిభక్తులును శ్రీ వేగాయమ్మపేట జమీందారువారును నగు శ్రీ రాజావాడ్రేవు విశ్వసుందరరావు బహద్దర్ వారివలన జరుపఁబడును. కాన నేతచ్ఛుభ ముహూర్తమునకు భక్తవరులెల్లరు విచ్చేసి యానందింపఁ బ్రార్థితులు.

ఇట్లు విధేయులు,
శ్రీ రాజా పశేల్ ఖానా భైరవరావు,
జమీందారు, పెదపళ్ల.

---

## ౧౪. ముక్తీశ్వరము - చంద్రవరము

గోదావరిమండలమున కమలాపురము రాజోలు తాలూకాలు రెండు నుద్యానవన మని చెప్పనొప్పు. భూమి సారవంతమై వరిచేల తోను, వివిధఫలవృక్షములతోను నిండియుండును. సమస్తవిద్యల కాటపట్టు. వేదాధ్యయనసంపన్ను లనేకులు గలరు. వ్యాకరణాది శాస్త్రవేత్తలు కవులు విద్వాంసులు నీ తాలూకాలోఁ గలరు.

అమలాపురము తాలూకాలో గోదావరితీరమునఁగల క్షణముక్తీశ్వరమున మన లింగమూర్తిగారు ద్రాక్షారామకోటిపత్రిపూజ జరిగిన పిమ్మట నొక సప్తాహ మాచరించిరి. ఇయ్యది మిగుల వైభముగ జరిగినది. పండితవర్యులగు బ్రాహ్మణులందఱు వీరికి బ్రహ్మరథం బొసగిరి.

పిదప మామగారియింటనే వసించుచున్న దాసుగారొకనాఁడు రాజమహేంద్రవరము వెళ్లఁగోరి గోదావరీతీరమునకు వచ్చువఱకు

నావదాఁటి పోయెను. తిరిగి యింటికి వచ్చుచుండ నొక కాలిదారి యగు పడెను. ఉబుసుపోకకై యామార్గమునఁబోవుబాటసారినడిగి యాదారి చంద్రవరగ్రామమునకుఁ బోవునని యెఱింగెను. చందవ్రరము తమ పూర్వులనివాస మగుటఁ జూడ నెంచి యా పాంథునితోఁ జందవ్రరముఁ జేరిరి. గ్రామస్థులు వీరి నతిగౌరవమున నాహ్వానించిరి. "ఇది మీపూర్వుల గ్రామము. మీరు పలుతావుల మహాత్కార్యము లాచరించితిరి. ఈయూర నేదైన నొక సత్కార్యముఁ గావింపుఁ"డని కోరిరి. కొందఱు రామాలయమును గట్టించిన బాగుండు ననిరి.

ఒక పెద్దకాపు '100-150 సంవత్సరములనుండి రామాలయముఁ గట్టింపవలెనన్నఁ గాకుండ నున్నది. వీరు కట్టింతురేమో' యని సావ హాసముగఁ బల్క దాసుగారు "నీ వేమి చందా నిత్తు"వనిరి. అతఁడొక యణా నిచ్చెను. దాసుగారు దాని నందుకొని టెంకాయఁ దెప్పించి దాపుననున్న రామమందిరముకడకుఁ జని రామపటమునకునమస్కరించి టెంకాయఁగొట్టి నైవేద్యమొనర్చి లోనున్న గరుడస్తంభము పటముఁ దెచ్చి యొకయింట నిడి యా పూరిమందిరము నూడదీయు మనిరి. కొద్దిసేపటిలో నా మందిరము నేలమట్ట మయ్యెను. ఆరాత్రియే రామాలయమునకుఁ బునాదులు త్రవ్వివైచిరి. మరునాఁ డుదయ మున నారువందల రొక్కమును, గొంత చందాపట్టియుఁ గొనివచ్చి దాసుగారి కీయ వారు దానిని ముట్టక యొకసంఘము నేర్పఱచి వారిస్వాధీన మొనర్చి దేవాలయనిర్మాణమునకుఁ గడంగిరి.

ఆ సమయముననే దాసుగారిని చాగలమఱ్ఱికిఁ గొనివచ్చుటకై నేను (పాలపర్తి సూర్యనారాయణ) జందవ్రరమునకు బోయితిని. ఇదివఱకు వారినిఁ జూడకుండుటచేతను మహాత్కార్యముల వినియుం డుటచేతను వా రేవిధముగ నుందురో యెట్లు మాటాడవలయు నెట్లు నమస్కరించవలయు నని యాలోచించుచు వారి మామగారివెంట వా రున్న యింటికి వెళ్ళితిని. కాని సామాన్యవేషంబున నిరాడంబర ముగ మఱియిరువురితోఁ గూర్చునియుండు దాసుగారిని వీరని తెలియక పోతిని. కొంతసేపటి కక్కడచేరిన భక్తులతోఁగలిసి భజనఁగావించి

దేవాలయనిర్మాణము జరుగుచోటికిఁ బోయితిమి. శ్రీమంతులు పునాదులు త్రివ్వుచుండిరి. అగ్రిజాతిస్త్రీలును భజన సలుపుచుండిరి. నా కెంతయు నాహ్లాదమయ్యెను. అందుండి రాత్రి 12 ఘంటలకుఁ బ్రయాణమై వచ్చుచుండ రెండుమైళ్ళ దూరముననున్న రైలుస్టేషనుదగ్గఱకు రెండుమూఁడు వందలనుంది జనులు వచ్చిరి. నే నక్కడనున్న 5-6 గంటలలో నైదారుపన్యాసములిచ్చిరి. జనము క్రిక్కిరిసి యుండిరి. కంసునిపంపున బలరామకృష్ణుల నక్రూరుఁడు గొంపోవునపుడు వ్రేపల్లె యెట్టిస్థితియందుండెనో నాఁడాచంద్రవర మా స్థితియందుండెననుట యతిశయోక్తి కాదు. గ్రామమంతయు మిగుల వలజడియయ్యెను.

పిదప నొక కాసైన కూలిఁబెట్టక యగ్రజాతిస్త్రీలును, సంపన్న గృహిణులును భజన సల్పుచు సున్నపుగానుగను సైతము ద్రిప్పి రామాలయమును బూర్తిఁజేసిరి. ప్రతిష్ఠకై శ్రీ దాసుగారి రాక కెదురుచూచుచున్నారు.

---

# ౧౫. చాగలమఱ్ఱి

శ్రీదాసుగారి గ్రామమునకు శుక్లసంవత్సర మాఘ బ ౧౨ రోజున వచ్చిరి. ఇంతకుముందీ గ్రామమున రెండునెలలుగా నొక సాధుండెను. వారినిఁ జూచుటకై దాసుగారితోఁ గలిసి మే మేగితిమి. అతఁడు బావియందు స్నానము సేయుచుండ నొక సాలగ్రామము దొరకగా దానిని పూజించుచుండెను. నేను (సూర్యనారాయణ) సాలగ్రామమును బూజార్థమై యా సాధుం గోరితిని. అతఁడియ్య సమకట్టనంతలో శ్రీదాసుగారు వారిని వారించి "యిది మిగుల నుత్కృష్టమైన లింగము. సామాన్యగృహస్థుఁడు దీనిఁ ధరింపనోపఁడు. ఏదేని దేవాలయమునఁ బ్రతిష్ఠ నొందఁదగినది. మీర పుచ్చుకొనవల దని చెప్పిరి చెంతనున్న చెన్నకేశవ దేవాలయ ప్రాకారములో నొక శూన్యమందిర ముండ దాని నప్పటి కప్పుడె

బాగుచేయించి గ్రామస్థులందఱి సహాయమున రాత్రి 12 గంటలకు (అమావాస్య మంగళవారము) బ్రతిష్ఠించిరి. మూఁడవరోజున భవానీ శంకరునకు (దాసుగారు ప్రతిష్ఠించిన సాలగ్రామలింగమునకు) లక్షబిల్వార్చనఁ గావించిరి. ఈ చెన్నకేశవాలయము చాల పురాతన మైనది. చోళరాజప్రతిష్ఠిత మైనది. శా. శ. ౧౩౯౧ లో నొక శాసనము కలదు. అప్పటికే చాల పురాతనమైన దని వ్రాయబడియున్నది. కాని తగినంత భూవసతిలేకపోవుటచే పూజాదులు జరుగుట లేదు. కడకు దీపారాధనకూడఁ గఱవయ్యెను.

దాసుగారు లింగప్రతిష్ఠఁ గావించినది మొదలు గ్రామవాసులు దేవాలయమునెడల శ్రద్ధ వహించుచున్నారు. నిత్యపూజలు జరుగుటకుఁగాను శాశ్వతనిధికి 5000 రూపాయలను వాగ్దత్తముజేసిరి. దాసుగారి లింగమాహాత్మ్యము నెక్కుడుగ వర్ణింతురు. చాగలమఱ్ఱి గ్రామమందేగాక కడప కర్నూలు మండలములందు నీలింగము నూత్న వికాసముఁ బుట్టించి యడుగంటుచున్న భక్తిని పునఃప్రతిష్ఠితము గావించు నని చెప్పుదురు.

---

## ౧౬. సురభేశ్వరీకోన సప్తాహము

సెలవు ముగియుటతోడనే దాసుగారు కంభం తాలూకా రాచర్ల ఫిర్కాకు రివిన్యూఇన్స్పెక్టరుగా మార్చఁబడిరి. వీ రిచ్చటకు వచ్చిన కొద్దిరోజులకే సప్తాహ మొనర్ప సంకల్పించి, జమదగ్నిమహాముని యాశ్రమమును, కోటిలింగముల కునికిపట్టును, గండకీనదీతీరస్థమును నగు సురభేశ్వరీకోనలో మిగుల వైభవముగ జరిపిరి. మామిత్రులగు హరివరం వెంకటరెడ్డిగారును, మఱికొందఱమును గలిసి యీ సప్తాహమునకు వెళ్ళితిమి. ఇట్టి వింతసప్తాహ మెందును గాంచమైతి మని యాప్రాంతపుఁ బెద్ద లెఱిఁగించిరి.

హరివరం వెంకటరెడ్డిగారు (శ్రీ) యహోబిలక్షేత్రముయొక్క ప్రస్తుతదీనదశకుఁగుంది, యిట్టి సప్తాహ మచట నీమహాత్ముఁడు వైభవముగ నెఱవేర్చినసప్తాహమున కరుదెంచిన భక్తులు (శ్రీ)వారి

యాలయమునెడ శ్రద్ధవహించి లోపములఁ దీర్ప యత్నింతు రని తల పోసి దాసుగారితోఁ బ్రస్తావనఁ జేసిరి.

వీ రందుల కంగీకరించి భాగవతమున బ్రశ్న వేయ మాఖ శు ౭ ముహూర్తము భగవంతునిచే నిర్ణయింపఁబడెను. "తథాస్తు" అని శ్రీ దాసుగారు మాఖ శు ౭ (26-1-31) నాఁడు శ్రీ యహోబిల దివ్యక్షేత్రమున సప్తాహముఁజేయ సంకల్పించిరి. ఇట్టి ప్రశ్నలకు బ్రత్యుత్తరము భాగవతమున బడయుట కందరికి సాధ్యము కాదు.

పెక్కుప్రయత్నము లిప్పటినుండియే మా మిత్రులు వీరంరెడ్డి నాగిరెడ్డిగారు మొదలగు పలువురు నడుము గట్టియొనరించుచున్నారు.

"ఇందుఁ గల డందు లేఁడని సందేహమువల"దనిన ప్రహ్లాదవరదుం డగు శ్రీ లక్ష్మీనృసింహక్షేత్రమునఁ బరమేశ్వరుఁ గర్తవ్యమున నాతని ప్రీతికొఱకు జగత్కల్యాణ మపేక్షించి నిష్కామియై భక్తుఁడు సంకల్పించు సమస్తకార్యముల కా రాముఁడే యధినాథుఁడై యతి వైభవమున నిక్కార్యము జరిపి భక్తుల ముద్దుఁ జెల్లించితీరు నను పర మాస్తిక్యబుద్ధిగల మన దాసుగారీ సప్తాహ మొనర్పఁ బ్రహ్లాదుని కోరికఁ దీర్చిన శ్రీ మహావిష్ణు వీభక్తవరుని వాంఛిత మొనఁగూర్చు టకు సందియము లేదు. దేవాలయధర్మకర్తగారు సప్తాహము జరుపుట కిప్పుడు కొంత యభ్యంతరము సలుపయత్నించినను, వారును దేవాల యౌన్నత్యముంగోరు మహామహులగుటచే దేవాలయోద్ధరణమునకుఁ గంకణముఁగట్టుకొనుట కెట్టి సందేహ ముండదు. శ్రీదాసుగారి సంకల్ప మును శ్రీరామచంద్రప్రభువు నెఱవేర్చుఁగాక! ఇట్టి లోకోపకారి యగుభక్తశిఖామణినిఁ బరమేశ్వరుఁడు చిరాయువుగా నొనర్చి రక్షిం చుఁగాక! వీరిజీవితాదర్శమునఁ బెక్కుజనులు భక్తినభ్యసించి ధన్యత నొందెదరుగాక.

శ్రీ లక్ష్మీనృసింహాలయము పూర్వపు టౌన్నత్యమంది నూత్న తేజమున నలరారుగాత. శ్రీ జియ్యరుగారిః దేవాలయోద్ధరణము సల్పిన యశస్సు చేకూరుగాక. సర్వేజనాః సుఖినో భవంతు.

సంపూర్ణము.

శ్రీ సీతారామచంద్ర పరబ్రహ్మణేనమః

అనుబంధము.

# భగవన్నామ భజనకీర్తనలు.

ఈ కీర్తనలను వీలగు రాగతాళములతో పాడుకొనవచ్చును. ఇయ్యవి మా చాగలమర్రి సీతారామభక్తసమాజమువారి వాడుకలో నున్నవి:—

1 రాఘవ - రాజీవనేత్రా
హరే రఘువర - పుణ్యచరిత్రా.

2 రాసక్రీడలోల చిన్ని - గోపాలబాలా
గోపాలబాలా - గోపికాలోలా.

3 లక్ష్మీశార్ఙ్గధరా - సీతాపతిరఘువీరా
రాధే గోవిందకృష్ణ - రఘువీర పాండురంగా.

4 శంభోశంకర - చంద్రశేఖరా
మహాదేవశంభో - మాధవవిష్ణో.

5 ఇభచర్మాంబర - భూమశివా
ఈశ బిలేశయ - భూమశివా.

6 మురళీధర - గోవర్ధనధారీ
శంఖచక్ర పీ - తాంబరధారీ

7 కంసధ్వంసన - కాళియమర్దన
దేవకినందన - భవహరణా.

8 సుందరమోహన - మేఘశ్యామా
పీతాంబరధర - సీతారామా.

9 హరిమురారే సీతారాం - ఆనందరూపా సీతారాం

10 చంద్రచూడ చంద్రచూడ - చంద్రచూడ పాహి మాం
చంద్రచూడ చంద్రచూడ - చంద్రచూడ రక్ష మాం.

11 రాధారమణమదనమోహన - బృందావనవిహార కృష్ణ
సాధుజనమనోవిహార - సర్వాధార ధీర కృష్ణ
మాధవ గోవిందకృష్ణ - మధురిపు గోపాలకృష్ణ

12 ప్రభుంప్రాణనాథం - విభుం విశ్వనాథం
జగన్నాథనాథం - సదానందభాసం.

13 గళేరుండమాలం - తనుం సర్పజాలం
మహాకాలకాలం - గణేశాధిపాలం

14 అచ్యుతం కేశవం - రామనారాయణం
కృష్ణదామోదరం - వాసుదేవం హరిం.

15 శ్రీధరం మాధవం - గోపికావల్లభం
జానకీనాయకం - రామచంద్రంహరిం.

16 సరయూతీరవిహారీ - దండకవనసంచారీ
దానవకులసంహారీ - శ్రీరామచంద్ర మురారీ.

17 అచ్యుతం కేశవం - సత్యభామాధవం
మాధవం శ్రీధరం - రాధికారాధితం.

18 యమునాతీరవిహారీ - బృందావనసంచారీ
గోవర్ధనగిరిధారీ - గోపాలకృష్ణ బాణారీ.

19 గంగాతీరవిహారీ - దారుకవనసంచారీ
త్రిపురాసురసంహారీ - శివనీలకంఠత్రిపురారీ

20 జయజయ హేమహిషాసురమర్దని
రమ్యకపర్దిని శైలసుతే.

21 భగవతి హే - శితికంఠకుటుంబిని
భూరికుటుంబిని - భూరికృతే.

22 ఈశగిరీశ నరేశ పరేశ - మహేశ బిలేశయభూషణభో

23 సాంబసదాశివ - శంభోశంకర
శరణం మే తవ - చరణయుగం.

24 ఉమయాశివ్య - సుమంగళవిగ్రహ
ఆలింగిత వామాంగ విభో.

25 ఋషివరమానసహంస చరాచర
జననస్థితిలయకారణ భో.

26 స్మరహర పురహర - నమోహరా
శంకర శంభోశివాహరా.

27 మధుమధురే - మధుకైతవ భంజని
కైటభభంజని - రాసరతే.

28 గోపాలం ప్రభులీలావిగ్రహ - గోపాలంకుల గోపాలం
గోపీఖేలన గోవర్ధనధృతి - లీలాలాలితగోపాలం.

29 గోపీమండల గోష్ఠీభేదం - భేదావస్థ మభేదాభం
శశ్వద్గోఖురనిర్ధూతోద్ధృత - ధూళీధూసరసౌభాగ్యం

30 కాంతం కారణకారణమాది - మనాదింకాల ఘనాభాసం
కాళిందీగత కాళియ సరసి - నృత్యంతం బహునృత్యంతం.

31 బృందారణ్యే బృందారకగణ - బృందారాధితవద్యేహం
కుందా భామలమంద స్మేరసుధా-నందం సుహృదానందం.

32 ఆనందరూపే - నిజభోగరూపే
బ్రహ్మస్వరూపే - శ్రుతిమూర్ధ్నిరూపే.

33 లక్ష్మీవిలాసే - జగతాం నివాసే
హృత్పద్మవాసే - అరవిందవాసే.

34 బ్రహ్మాది వంద్యే - జగదేకవంద్యే
వంద్యే ముకుందే - వదనారవిందే.

35 పద్మాధిరాజే - గరుడాధిరాజే
విరించిరాజే - సురరాజరాజే.

36 సచ్చిత్తశాయీ - భుజగేంద్రశాయీ
సదాంకశాయీ - కమలాంగశాయీ.

37 మహేశం సురేశం - సురారాతినాశం
విభుం విశ్వనాథం - విభూత్యంగభూషం.

38 గిరీశం గణేశం - గళే నీలవర్ణం
గజేంద్రాధిరూఢమ్ - గుణాతీతరూపమ్.

39 అజం శాశ్వతం - కారణం కారణానాం
శివం కేవలం - భాసకం భాసకానాం.

40 నమస్తే నమస్తే - విభో విశ్వమూర్తే
నమస్తే నమస్తే - చిదానందమూర్తి.
నమస్తే నమస్తే - తపోయోగగమ్య
నమస్తే నమస్తే - శ్రుతిజ్ఞానగమ్య.

41 నరహరిదేవ - జనార్దన కేశవ
నారాయణ - కనకాంబరధారీ.

42 కంతుజనక - త్రిపురాంతక నరహరి
సీతానాయక - శ్రీరఘునాయక.

43 నందనందనానంద - ముకుంద
బృందావన - గోవిందానంద.

44 వామనమాధవ - వైకుంఠాధిప
దేవదేవ - దేవారివిదారీ.

45 పంకజలోచన - పరమదయాళూ
శంకరనుత స - ర్వేశ్వర నరహరి.

46 అంబరీష వర - దాంబుజలోచన
అంబుధిబంధన - అమితపరాక్రమ.

47 అజ భవనుత కంసారీ
అచ్యుత కృష్ణ మురారీ.

48 మురళీ గాన వినోదా
వ్యత్యస్తా ద్భుతపాదా.

49 యమునా తీర విహారా
దృఢ కౌస్తుభ మణిహారా.

50 సీతారామం - చిన్మయధామం
శ్రితుల సీదళ - శీకరధామం

51 శ్యామలగాత్రం - సత్యచరిత్రం
రామదాస హృ-దాబ్జీవమిత్రం.

52 రామకృష్ణ గోవింద - నారాయణా
కృష్ణరామ గోవింద - నారాయణా.

53 వాసుదేవముకుంద - వనమాలి చక్రధర
నారసింహాచ్యుతా - నారాయణా.

54 కంసవినాశన - కరుణాంతరంగా
కనకాంబరధర - కస్తూరితిలక.

55 నిత్యానందా - నిర్మలచిత్తా
నిర్వికారా - నిగమగోచరా.

56 జయరఘువీర - జగదేకశూర
భయదనివార - భక్తమందార.

57 దశరథబాల - దాసానుకూల
దశముఖకాల - ధరణీశపాల.

58 మురళీవిలోల - మునిజనపాల
తులసీవనమాల - తుంబురులోల.

59 రావణభంగ - రమణీయాపాంగ
పావనలింగ - పాదాబ్జభృంగ.

60 దశరథపుత్ర - ధన్యచరిత్ర
పశుపతిమిత్ర - భాసురగాత్ర.

61 రాజీవనేత్ర - రమణీయగాత్ర
సీతాకళత్ర - సింధుపవిత్ర.

62 పుండరీకాక్ష - పూతనశిక్ష
పాండవపక్ష - భువనైకదక్ష.

63 నందగోపతనయం - పరాత్పరం
నారదాదిముని బృ - న్దవన్దితం.
64 సీతాపతేరామ - రాధాపతే కృష్ణ
శ్రీరుక్మిణీ సత్య - భామాపతే
65 వాణీపతే బ్రహ్మ - లక్ష్మీపతే విష్ణు
గౌరీపతే శంభో - నారాయణా.
66 సీతాపతే - దాశరథే
దశరథనందన - దయానిధే
67 కాశీపతే - వారణాశీపతే
గంగాజటాజూట - గౌరీపతే.
68 రామ రామ రఘురామ పరాత్పర
రావణసంహార - రఘువీరా.
69 శ్రీరామ జయరామ - జయజయరామా
ఓరామ - ఓరామ - ఓంకారనామా.
70 శంభోశంకర గౌరీశా - సాంబసదాశివ విశ్వేశా.
71 అయోధ్యవాసీరాం - ఆనందరూపారాం
జానకిజీవనరాం - జయజయరామ రామ రామా.
72 నందనందనా - యదువంశమండనా
పరమపావనా - భక్తపాలనా.
73 రఘుపతిరాఘవ రాజారాం
పతితపావనా - సీతారాం.
సీతారామ - సీతారామ - జానకిజీవన జయజయరామ.
74 శ్రీఆంజనేయం - ప్రసన్నాంజనేయం
ప్రభాదివ్యకాయం - ప్రకీర్తిప్రదాయం
75 భజేవాయుపుత్రం - భజేవాలగాత్రం
భజేహం పవిత్రం - భజేసూర్యమిత్రం.
76 స్ఫురన్మౌళికల్లోలినీ - చారుగంగా
లసద్భాలబాలేందు - కంఠేభుజంగా.

77 శ్రీచండశ్రీకృష్ణం - శ్రీగల్భంవకేశం
అఖండం అజం భాను - కోటిప్రకాశం.

78 కళాతీతకళ్యాణ - కల్పాంతకారీ
సదాసజ్జనానంద - దాతాపురారీ.

79 వానరసేనా - నాయక హనుమా
సీతాన్వేషణ - పండిత హనుమా.

80 అక్షయహంతక - అతిబల హనుమ
నవవ్యాకరణ - పండిత హనుమా.

81 నమస్తేస్తు - మహామాయే
శ్రీపీఠే - సురపూజితే.

82 శంఖచక్ర - గదాహస్తే
మహాలక్ష్మి - నమోస్తుతే.

83 సర్వపాప - హరేదేవీ
మహాలక్ష్మి - నమోస్తుతే.

84 సర్వజ్ఞే - సర్వవరదే
సర్వదుష్ట - భయంకరీ.

85 సిద్ధిబుద్ధి - ప్రదేదేవీ
ఆదిశక్తి - మహేశ్వరీ.

86 శీతలే త్వం - జగన్మాతా
శీతలే త్వం - జగత్పితా,
శీతలే త్వం - జగద్ధాత్రీ
శీతలాయై - నమోనమః.

87 గోవర్ధనగిరిధర-గోవింద । గోకులపాలక-పరమానంద
శ్రీవత్సాంకిత-శ్రీకౌస్తుభధర। భావకభయహర పాహిముకుంద.

88 ఆనందామృతవారిధిఖేల - అలఘుపరాక్రమ అనుపమలీల
శ్రీనందాత్మజ శ్రితజనపాల - శ్రీ కరకిసలయలాలనలోల.

89 శ్రీలక్ష్మిప్రియ - పండరినాథా
శ్రీమన్నారాయణ - పండరినాథా

90 పక్షివాహన - పండరినాథా
ప్రహ్లాదవరద - పండరినాథా
91 ముక్తిదాయకా - పండరినాథా
మునిజనవందిత - పండరినాథా
92 ఇందిర రమణా - పండరినాథా
ఇభరాజవరదా - పండరినాథా.
93 శేషశయన (శ్రీ) - పండరినాథా
జయదేవవినుత - పండరినాథా.
94 దినకర తేజా - పండరినాథా
మురహరవరదా! - పండరినాథా !
95 పరమపురుష (శ్రీ) - పండరినాథా
పతితపావనా - పండరినాథా.
96 సహస్రశీర్షా - శంకరమిత్రా। సార్వభౌమ (శ్రీ)నాథా
అనంతరూపా - అక్షయఫలదా। ఆపదోద్ధారక రామా.
97 మోక్షలక్షణేక్షణా - మోక్షధర్మరక్షణా
మోక్షసౌఖ్యదాయకా - మోక్షరాజ్యనాయకా.
98 పరంధామ దివ్య - ప్రభావాభిరామా
పరాకాశసంపూర్ణ - భవ్యప్రకాశా
పరానంద దేవాధిపా - విశ్వతుండా
పరానంద సచ్చిత్స్వభా - వాత్మరూపా.
99 పశూనాం పతిం - పాపనాశంపరేశం
గజేంద్రస్యకృత్తిం - వసానంవరేణ్యం.
100 భజశ్రీరామం - భజరఘురామం
దశరథరామం - తారకనామం.

మంగళమ్

మంగళం భగవాన్విష్ణు - మంగళం మధుసూదనా
మంగళం పుండరీకాక్ష - మంగళం గరుడధ్వజా॥

ఓం తత్సత్.